ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్



Like us to follow

@mohanpublications




- శ్రీ జి.ఎన్.రెడ్డి

# ఆంధ్ర మహాభారతము - శల్య, సౌప్తిక, స్త్రీపర్వం

Telugu Classics – Popular Edition Series.

# ఆంధ్ర మహాభారతము

## [శల్య సౌప్తిక స్త్రీ పర్వాలు]

పరిష్కర్త

జి. యస్. రెడ్డి

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి.




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు–500004

# తొలిపలుకు

ఆంధ్రప్రదేశ్ మాజీమంత్రివర్యులు శ్రీ యం. ఆర్. అప్పారావుగారు చేసిన సూచన ననుసరించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీ తెలుగు భాషలోని ప్రాచీనసాహిత్యము అందరికి అందుబాటులో నుండులట్లుగా ముద్రించి ప్రకటింప వలె నని నిశ్చయించినది. తెలుగుభాషలోని పూర్వగ్రంథసముదాయము యీనాడు పాఠకునకు సక్రమముగా సరసమైన ధరకు లభ్యమగుటలేదు. ఈలోటును తీర్చి ప్రాచీనగ్రంథసంచయమును విడివిడిగా ప్రకటించుటకు సాహిత్యఅకాడమీ ఒక ప్రణాళిక సిద్ధము చేసినది. ఈ ప్రణాళిక ప్రకారము యీ కార్యక్రమము మూడు తరగతులుగా విభజించనైనది. మొదటిది ప్రాచీన ప్రబంధాల ప్రకటన; రెండవది మహాభారతము ప్రచురణ; మూడవది హరివంశము, భాస్కరరామాయణము, బసవపురాణము, భోజరాజీయములను సంగ్రహించి ప్రకటించుట పై ప్రణాళిక ప్రకారము ప్రచురింపబడు ప్రతిగ్రంథములో గ్రంథకర్తను గూర్చి, గ్రంథ ప్రాశస్త్యమును గూర్చి వివరించు సుమారు 40 పేజీల పీఠికను చేర్చవలెనని నిశ్చయించనైనది.

ఈ కార్యక్రమములో ప్రాచీనప్రబంధాల ప్రకటనము పూర్తయినది సంక్షిప్తగ్రంథ ప్రచురణ కార్యక్రమములో బసవపురాణ, భాస్కరరామాయణ, హరివంశ, భోజరాజీయములు ప్రచురింపబడినవి. ప్రస్తుతము ఆంధ్ర-మహాభారత ప్రకటనము చేపట్టనైనది. ప్రసిద్ధులైన విద్వాంసులచే భారతసంపుటముల పరిష్కారము నిర్వహింపబడుచున్నది

ఆంధ్ర మహాభారత సంపుటములలో శల్య, సౌప్తిక, స్త్రీ పర్వముల పరిష్కరించి, పీఠిక వెలయించి మాకందజేసిన డా॥ జి. యన్. రెడ్డిగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

పైన పేర్కొబడిన గ్రంథ సంపుటాల వ్రాతప్రతులను సిద్ధము చేసి ముద్రించుటకు అవసరమైన డబ్బును పూర్తిగా అకాడమీకి యిచ్చుటకు కేంద్ర

రాష్ట్ర ప్రభుత్వాలు, వాగ్దానము గావించి అందులో చాలామట్టుకు డబ్బును విడుదల కూడ చేసినవి. అందుకు అకాడమీ పక్షాన కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలకు ధన్యవాదాలు. సాధ్యమైనంత త్వరలో మహాభారత సంపుటముల నన్నింటిని సిద్ధము చేసి, ఆంధ్ర పాఠకలోకానికి అందజేయుట జరుగగలదని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు
20-11-1976

**దేవులపల్లి రామానుజరావు**
కార్యదర్శి

# పీఠిక

మహాభారతం మానవప్రకృతిని ప్రతిబింబించే మహేతిహాసం. ప్రకృతి అంటే స్వభావం. మానవస్వభావం బహువిధమూ, బహుముఖమూ అయినట్టిది. ఐహికమైన మానవజీవితం నిత్యసంఘర్షణ భరితమైంది. ఈ సంఘర్షణ మూడు విధాలు: హృదయానుభూతికి, యుక్తాయుక్త విచక్షణకు సంబంధించిన సంఘర్షణ. ఇది వైయక్తికం. రెండవది వైయక్తికానుభూతికి సామాజిక ధర్మాధర్మాలకు మధ్య ఏర్పడే సంఘర్షణ. ఇది సామాజికం. ఇక మూడవది పరిమితమైన వైయక్తిక శక్తి అలౌకికమైన దివ్యశక్తిని ఎదుర్కొన్నప్పుడు సంభవించే సంఘర్షణ. ఈ విధంగా మనఃక్లేశ సంఘర్షణాదులకు లోనైనట్టి మానవ ప్రకృతి వైయక్తిక, సామాజిక, అలౌకిక శక్తులచే నిర్ణీతమై అభివ్యక్తమౌతూ వుంటుంది. గోచరాగోచరమైన ప్రకృతితత్త్వాన్ని శోధించి తెలుసుకోవడానికి ప్రయత్నించడం మానవప్రకృతిలో ఒక ప్రధానాంశం. ఇదే జిజ్ఞాస. మానవుణ్ణి ఇతర జంతుకోటినుండి వేరు చేసే లక్షణం ఈ జిజ్ఞాసయే. మానవ నాగరకతా సంస్కృతులకు, జ్ఞానాభివృద్ధికి, కళాత్మకమైన సృష్టికి, ఆధ్యాత్మిక చింతనకు. సామాజికమైన సుఖజీవనాభిలాషకు, జీవిత లక్ష్యాన్వేషణకు, నైతికమైన విలువలకు మూలాధారం కూడ ఇదే. పుట్టలోని చెదలు పుట్టదా గిట్టదా అన్నట్లు మానవకోటిలో పుట్టుట, పెరుగుట, చచ్చుట. ఈ మూడుదశలకు లోనైనట్టి అనామక ప్రజ అత్యధికం. ఇట్టి సామాన్యప్రజానీకానికి కొన్ని మెట్లు పైనున్నవారు నేతలు, నాయకులు, పాలకులు, యోధులు, ప్రతిభాన్వితులు, తాత్త్వికులు, ఆదర్శపురుషులు మొదలైనవారు. ఇట్టివారి స్వభావంలో దృక్పథంలో, కార్యదక్షతలో, జీవిత విధానంలో వారివారి స్వభావాన్ని బట్టి వైవిధ్యం కన్పిస్తుంది. ఆ వైవిధ్యాన్ని బట్టి మానవుల్ని ఉత్తమ మధ్యమాది వర్గాలుగా లోకం వర్గీకరించ వచ్చు. మానవప్రకృతి, అందలి వైవిధ్యం, మానవ జీవితానికి ఏర్పడే వైయక్తిక, సామాజికాది సంఘర్షణత్రయం సార్వకాలికమూ సార్వదేశికమూ అయినట్టివి. ఐతిహాసికయుగానికి. నేటికి మానవుల వేష భాషల్లోను,

ఆహార విహారాల్లోను భేదం వుండవచ్చు. ఇది బాహ్యమైనట్టిదే. కాని, ఐతిహాసిక యుగానికి, ఆధునిక యుగానికి మానవ ప్రకృతిలో మాత్రం భేదం లేదు. ఆనాటి రాగద్వేషాలు, కోపతాపాలు, చెలిమి చుట్టరికాలు, ఉపకారాపకారా బుద్ధులు, న్యాయాన్యాయాలు, అధికార కాంక్ష, ఆశ్రిత జనప్రీతి, వర్గ విచక్షణ, స్తోత్ర ప్రియత్వం ఇత్యాది లక్షణాలెన్నో ఈ నాటి మానవ ప్రకృతిలోనూ ఉన్నాయి. కన్నబిడ్డల మీద మమకారంతో న్యాయాన్ని చూడలేని ధృతరాష్ట్రులు, తీరని అధికారదాహంతో తపించే దుర్యోధనులు, మాత్సర్యావేశ పరులైన ద్రోణులు, అబలల్ని బలాత్కరించే కీచకులు, లక్ష్యసాధనకు దయా దాక్షిణ్యాలు పాటించని శ్రీకృష్ణులు, కార్యసాధనకు అసత్యాన్ని అంటీ అంటనట్లు చెప్పగల ధర్మ రాజులు, వ్యక్తిత్వాన్ని ఇతరులకు తాకట్టు పెట్టే అనుచరులు, ఈనాడూ మనకు ఎవరిలోనో ఒకరూపంలో కనిపిస్తూనే వుంటారు. ఇట్టి వైవిధ్య సహితమూ, సార్వకాలికమూ అయిన మానవప్రకృతికి మహాభారతం ఒక దర్పణం. కాబట్టి మానవ ప్రకృతి మానవప్రకృతిగా నిలిచి వున్నంతకాలం మహాభారతం మానవ సాహిత్య ప్రపంచంలో మేరువుగా నిలిచి వుంటుంది. మణిపూసగా ప్రకాశిస్తూ వుంటుంది.

మహాభారతంలో పద్దెనిమిది పర్వాలను ఆదిపంచకం, యుద్ధషట్కం, శాంతి సప్తకం అని మూడు భాగాలుగా వ్యవహరించే సంప్రదాయం ఒకటుంది. బహుశా ఇది తెలుగు దేశంలో ఏర్పడ్డ సంప్రదాయమే కాబోలు. ఎందుచేతనంటే మహాభారతానికి తెనుగుదేశంలో ఉన్న వ్యాప్తి ప్రాముఖ్యం మరోప్రాంతంలో లేదు. అష్టాదశ పర్వభరితమైన మహాభారతాన్ని నన్నయ ఈ క్రింది పద్యంలో కీర్తించినాడు.

అమితాఖ్యానక శాఖలం బొలిచి వేదార్థామల చ్ఛాయ మై
సుమహావర్గ చతుష్క పుష్ప వితతిన్ శోభిల్లి కృష్ణార్జు నో
త్తమ నానా గుణ కీర్తి సార్థ ఫలమై ద్వైపాయనోద్యాన జా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసురప్రార్థ్యమై. (ఆది. 1-66)

నన్నయ భావించినట్లు మహాభారతమొక దివ్యవృక్షమైనట్లయితే ఆ వృక్షానికి మూలం ఆదిపంచకం, స్కంధం యుద్ధషట్కం; శాఖోపశాఖలు శాంతి

సప్తకం; అని నన్నయ భావనను వ్యాఖ్యానించవచ్చు. అంటే మహాభారత వృక్షానికి ఆధారం ఆది పంచకం; ఆయువుపట్టు యుద్ధషట్కం; సారం శాంతి సప్తకం. ఆదిపంచకంలో గాని శాంతిసప్తకంలో గాని పర్వాల పేర్లు వ్యక్తి నామాంకితాలు కావు. స్థల విషయ కార్య తత్వాదుల్ని సూచించే పేర్లవి. యుద్ధ షట్కంలో భీష్మ ద్రోణ కృప శల్య పర్వాలు-కౌరవపక్ష సేనానాయక నామాంకితాలు. సౌప్తికపర్వాన్ని వీర నామాంకితంగా చెప్పాలంటే అశ్వత్థామ పర్వంగా చెప్పాలి. కాని అశ్వత్థామ బ్రాహ్మణోచితం, వీరోచితం కానట్టి అధమాధమ ప్రవర్తనను ప్రదర్శించినందు వల్ల అతని పేరును పర్వాంకితం చేయడం అనుచితం. ఇక స్త్రీపర్వం యుద్ధపంచకానికి ఒక విధమైన సింహావలోకనం. యుద్ధ పరిణామఫలమైన శోకం ఇందు మూర్తీభవించింది. విజేతల హృదయాలు నిర్భరమైన నిర్వేదానికి, పశ్చాత్తాపానికి పాల్పడ్డాయి మానవుని శీల పరీక్షకు. ధర్మనిరతికి యుక్తాయుక్త విచక్షణకు క్లిష్ట పరిస్థితులు ఒకగీటురాయి. అట్టి పరిస్థితుల్లోనే వ్యక్తుల నిజస్వరూపం బయట పడుతుంది. కురుపాండవులకు యుద్ధం అనివార్యంగా పరిణమించి నపుడు, బంధుమిత్రులు, రాజులు, సామంతులు, వీరులు ధర్మాధర్మ నిర్ణయాలు చేసుకొని లక్ష్యాన్ని నిర్దేశించుకొని కార్యరంగం లోకి ఉరకవలసివచ్చింది. కాబట్టే భారత పాత్రల బాహ్యాభ్యంతర ప్రవృత్తులు యుద్ధషట్కంలోనే ప్రస్ఫుటంగా గోచరిస్తాయి.

యుద్ధషట్కాన్ని రెండు భాగాలుగా వింగడించవచ్చు. భీష్మ ద్రోణ కర్ణ పర్వాలు ఒక భాగం; శల్య సౌప్తిక స్త్రీపర్వాలు మరొకభాగం. కర్ణ పర్వంతో - అంటే కర్ణవధతో - కురుక్షేత్రయుద్ధం సమాప్తమైనట్లే పద్దెనిమిది అక్షౌహిణుల సైన్యం సర్వనాశన మైంది అప్పటికి పదిహేడు రోజులు జరిగిన భారతసంగ్రామంలో కౌరవపక్షంలో దుర్యోధన కృతవర్మాశ్వత్థామ శకుని శల్యులతో పాటు 'పదునొకండు వేలు రథంబులును, పదివేలు నేడు నూఱు గజంబులును, రెండు లక్షల హయంబులును మూడుకోట్ల పదాతులును' పాండవ పక్షంలో పాండవులు, కృష్ణ సాత్యకులు, ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయాదులతో పాటు "ఆఱువేలు రథంబులును, మూడు వేలేనుంగులును, లక్ష గుఱ్ఱంబులును, కోటి కాల్బలంబులును" మాత్రమే మిగిలాయి. పద్దెనిమిదవ రోజు పగలు శల్య దుర్యోధనులవధతో కౌరవసైన్యం నిశ్శేషమైంది. శల్యదుర్యోధనుల వధ

శల్య పర్వాంతర్గత కథ. ఆ రాత్రి ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయుల సంహారము ఇది సౌప్తిక పర్వాంతర్గత కథ. స్త్రీ పర్వంలో యుద్ధం వల్ల కలిగి నట్టి లోకానర్థం ప్రత్యక్షంగా, శోక భూయిష్టంగా, కరుణరసోత్పాదకంగా వర్ణిత మైంది. భారతయుద్ధంలో దుష్టులే కాదు శిష్టులు కూడ మరణించినారు. దుష్టుల పాపకృత్యాల వల్ల అమాయకులు కూడా హత మౌదు రనుట, పాపప్రవర్తకుల యెడ ఔదాసీన్యాన్ని వహించి ప్రతిఘటించలేని శిష్టులు కూడా పాపఫలాన్ని అనుభవింతురనుట భారతసంగ్రామంలో ప్రతిధ్వనించే సత్యం. ఈ సత్యాన్నే కృష్ణుడు ఇట్లు చాటినాడు.

సారపుధర్మమున్ విమలసత్యము ( బాపము చేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁ బాఱిన దైన యవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష సేసి రది వారల చేటగుఁగాని ధర్మ ని
స్తారక మయ్యు సత్య శుభదాయక మయ్యును దైవ ముండెడున్.

(ఉద్యోగ. 3-273)

కవిత్రయ భారతంలో భారత కథాకథన సందర్భ విషయంలో నన్నయ తిక్కనలకు భేదం కన్పిస్తుంది. రోమహర్షణ పుత్రుడు సుపౌరాణికుడు అయిన ఉగ్రశ్రవసుడు జనమేజయుని ఆస్థానంలోని వైశంపాయన మహర్షి భారతకథ చెప్పగా విని వచ్చి నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు చెప్పి నట్లు నన్నయ భారత కథను నిర్వహించినాడు. తిక్కన అట్లుగాక వైశం పాయనుడు జనమేజయునకు చెప్పినట్లు విరాటాది పదేను పర్వాల కథను సాగించి నాడు. వ్యాస భారతంలో భారత యుద్ధ కథన భాగం సంజయుడు ధృతరాష్ట్రునికి వర్ణించి చెప్పినట్లుంది. తిక్కన గూడ అట్లే నిర్వహించినాడు. కురు పాండవుల మధ్య సంధి ప్రయత్నాలు విఫలమైనాయి. ఇరుపక్షాలు యుద్ధానికి సంసిద్ధులైనాయి. కురుక్షేత్రం రణరంగంగా నిర్ణీతమైంది. సుతుల సమరోత్సాహం ధృతరాష్ట్రునికి నిరుత్సాహాన్ని కల్గించింది. ప్రక్కన సంజయు డున్నాడు. అపుడు వేదవ్యాస మహర్షి విచ్చేసి ధృతరాష్ట్రునితో ఇట్లన్నాడు.

కాలం బగుటయు నృపులకు
నాలము సమకూరె దీని కడలకు మది నీ

వాలో కింపఁగ వలసిన
నీ లోనికి దివ్యదృష్టి నిచ్చెదఁ బుత్రా. (భీష్మ. 1-6)

అందుకు ధృతరాష్ట్రుడు సుతుల ఘోర సంగ్రామాన్ని చూడలేను, వినవలతునన్నాడు. యుద్ధప్రకారాన్ని వర్ణించి చెప్పడానికి వ్యాసుడు సంజయుణ్ణి నియోగించి అతనికి "ఆ రెండు తెఱఁగుల వారి దివారాత్ర ప్రవర్తనంబులు గనునట్లును, రహస్య ప్రకార భాషణంబులు వినునట్లును, మనోవృత్తంబు లెఱుంగునట్లునుంగా వరంబు" ఇచ్చినాడు. అంతేగాకుండ "అతిశీఘ్రగమనంబును, భారత సమర ధరణిం దిరిగినను శస్త్రాస్త్రంబు లెవ్వియుం దాఁకకుండునట్టి ప్రభావంబుఁ బ్రసాదించి, దివ్యుల యాలాపంబులు రూపంబులు దలంపులుం దేటపడునట్టి మహనీయ బోధంబును గలుగ ననుగ్రహించి" నాడు. మరి ధృతరాష్ట్రునితో "వగవంబని లేదు ధర్మోజయతనచు నిశ్చింతగ నుండుమ"ని ధైర్యం చెప్పివెళ్ళినాడు. ఈ ఏర్పాటు ప్రకారం సంజయుడు యుద్ధభూమికి వెళ్లిఅక్కడ జరిగినదంతా చూచి వచ్చి హస్తినాపురంలో రాచనగరులో వున్న ధృతరాష్ట్రునికి యుద్ధ ప్రకారాన్ని సవిస్తరంగా వర్ణించి చెప్పాలి. కాని సంజయుడు ప్రతిరోజు యుద్ధభూమికి వెళ్లిరాడు. మొదట వెళ్లినవాడు పదిదినముల తర్వాత భీష్మ పతనానంతరం సాయంకాలం వచ్చి అప్పటికి జగిరిన పదిరోజుల యుద్ధాన్ని ఒక్కరాత్రిలో ధృతరాష్ట్రునికి చెప్పి ఉదయాన్నే వెళ్లిపోయాడు. మరల ఐదురోజులకు వచ్చి ద్రోణాచార్యుని నాయకత్వాన జరిగిన యుద్ధాన్ని ఒక రాత్రికాలంలో వర్ణించి చెప్పాడు. మరల రెన్నాళ్లకు వచ్చి కర్ణవధను తెలిపాడు. పదునెనిమిదవ రోజు ఉదయం వెళ్లి మరుసటి రోజు ఉదయాన్నే వచ్చి శల్య దుర్యోధనుల వధను,నిద్రావశులైన ద్రౌపదేయుల్ని అశ్వత్థామ హత్యజేసిన రీతిని వర్ణించి చెప్పినాడు. ఈ విధంగా నాలుగు మార్లు రణరంగం నుండి సంజయుడు కురుక్షేత్ర విశేషాల్ని చెప్పడానికి వస్తాడు. వచ్చినపుడల్లా కౌరవ పక్షంలోని సేనానాయకుని చావుకబురు ముందు చెప్పి ఆ తర్వాత జరిగిన యుద్ధప్రకారాన్ని వర్ణిస్తాడు.

## శల్యపర్వం

కురుక్షేత్రయుద్ధంలో పదునేడవరోజు కర్ణుడు మరణిస్తాడు. కౌరవ సేన సమసిపోయింది. కౌరవపక్షంలో ఆనాటికి మిగిలిన యోధులు దుర్యోధన

శల్య శకుని కృప కృతవర్మాశ్వత్థామలు. ఇకనైనా సంధి లాభదాయకమే అని కృపాచార్యుడు దుర్యోధనునితో "సమరము నిష్కారణ వైరమునం బాసిల్లె", "కలవారెల్లను దెగి నీకలన నిలిచెఁగార్యము", 'నినుగాచికొనుము", "సంధిచేయు మిత్రరిన్' అనిచెప్పును కాని దుర్యోధనుడు

నేఁడు దుశ్శాసనుని బొమ్మ నెత్తు రనిల
సుతుఁడు ముదమునఁ ద్రావుట సూచి కొలఁత
ప్రతిన దీర్చు నతండని భయముఁ బొంది
పొందు గోరిన నది యేల పొసగుఁ జెపుమ [శల్య 1-67]

అని చెప్పి ఆత్మాభిమానంతో "రాజులు భక్తిఁగొల్వఁగ ధరావలయం బఖిలంబు దర్పవిభ్రాజిత వృత్తి" నేలుచు న్న "నాకు నింకాజియె కాక యొక్కని దయం గను రాజ్యసుఖంబు లేటికిన్" అని సంధికి ఇష్టపడక శల్యుని కౌరవ సేనానాయకుని చేస్తాడు. అప్పటికి కౌరవపక్షంలో శేషించి ఉన్న సేన 11 వేల రథాలు, 10700 ఏనుగులు, 2 లక్షల గుర్రాలు, 3 కోట్ల కాల్బలం. ఈ సైన్యంతో శల్యుడు సర్వతోభద్రవ్యూహాన్ని పన్ని వీరవిహారం చేసి ధర్మరాజుచేతిలో మరణిస్తాడు. శకుని గూడ సంహరింప బడ్డాడు. మడుగులో దాగిన దుర్యోధనుణ్ణి రెచ్చగొట్టి భీముడు గదా యుద్ధానికి ఉపక్రమిస్తాడు. ఈవార్త నారదుని వల్ల విన్న బలరాముడు - కురు పాండవుల మధ్య రాయబారాలు విఫలమై సమరం అనివార్యమని తెలుసుకొన్నప్పుడు ఏపక్షాన చేరక తీర్థయాత్రకు వెళ్లి పోయినాడు. శిష్యులైన భీమ దుర్యోధన గదా యుద్ధ దర్శనాభిలాషుడై వచ్చినాడు. ఈ సందర్భం లోనే జనమేజయుని కోరికపై వైశంపాయనుడు బల రాముని తీర్థయాత్రా విశేషాలను సవిస్తరంగా చెబుతాడు. భీమ దుర్యోధనులు గదా యుద్ధానికి ఉపక్రమించినపుడు ఉల్లేఖింపబడిన బలరాముని తీర్థయాత్రా వర్ణన ప్రక్షిప్తమని కొందరి విమర్శకుల అభిప్రాయం.

బలరాముని చూచిన దుర్యోధనునికి "నెమ్మనము తెలివొందె, మూపులు దనరె, మొగం బలరె" నట. గదాయుద్ధరంగంగా కురుక్షేత్రాన్నే ఎన్నుకొన్నారు. దుర్యోధనుడు అసదృశమైన గదాకౌశలాన్ని ప్రదర్శించినాడు అతనిదే పై చేయి కాని దుర్యోధనుని ఎట్లైనా చంపింప దలచినాడు శ్రీకృష్ణుడు. 'నాభికి దిగువ

యైన శరీరభాగంబు నొప్పించుట ధర్మంబు గాదని శాస్త్రోక్తి' ఇది తెలిసియు శ్రీకృష్ణుడు భీముని చేత దుర్యోధనుని తొడలు విరుగ గొట్టించినాడు. అంతేకాదు తొడలు విరిగి పడిన దుర్యోధనుని సమీపించి భీముడు—

ఏకవస్త్రఁ బాంచాలి నట్లీడ్చి తేరఁ
బనిచి సభలోనఁ బఱచిన పాప ఫలము
ననుభవింపుము దుష్టాత్మయనుచు వామ
చరణమున బెట్టిదము గాఁగ శిరము దన్నె (శల్యా. 2-278)

అధర్మముగా నాభికి దిగువ గదను ప్రయోగించి ఊరుభంగము చేసిన భీముని మీదికి బలరాముడు 'కోపవేగమునఁ దామ్రముఖుండై లేచి బాహుళెత్తి' తన హలాయుధాన్ని గ్రహించి వెళ్ళినాడు. అపుడు శ్రీకృష్ణుడు అన్నను అడ్డగించి 'కపటంబున నపకారములు చేయుచున్న వీనిఁ గపట ప్రకారంబునఁ బరవైచుట ధర్మహానియై తోపదు. వీడు పాండవ యాదవవంశ వర్ధనుండగు సుభద్రా నందనుం దెగటార్చిన తెఱం గెఱుంగమే' అని వారింప బలరాముడు 'రణధర్మంబు దప్పక పెనంగి నట్టి ధర్మాత్ముండైన దుర్యోధనున కుత్తమలోకం బయ్యెడు మనుచు' సానుభూతి చూపి రథమెక్కి వెళ్లిపోయాడు తొడలు విరిగి పడిన దుర్యోధనుని నిందించి శ్రీకృష్ణుడు 'ప్రొద్దు వ్రాలె సైనికవరులు విశ్రమింప' వలయునని పాండవుల నందరిని శిబిరములకు బంపి తాను గాంధారీ ధృతరాష్ట్రుల నోదార్చడానికి హస్తినాపురానికి వెళ్లినాడు.

ఆ పిదప కృపాచార్య కృతవర్మాశ్వత్థామలు రణరంగంలో ఏకాకిగా పడివున్న దుర్యోధనుని చేరినారు అశ్వత్థామ సుయోధనుని ఓదారుస్తూ

వినుము సత్యంబు వల్కెద మనుజనాథ
యదరి యందఱఁ బాంచాలు రాది గాఁగఁ
గలుగు బాంధవ మిత్ర సంఘముల తోడఁ
గూడ నేఁడిదె కృష్ణుండు సూడఁ ద్రుంతు. [శల్యా: 2-412]

అని చెప్పిన మాటలు దుర్యోధనునికి జయోత్సాహాన్ని రేకెత్తించింది.

అశ్వత్థామకు సేనాధిపత్యాభిషేకం చేసి పంపినాడు. ఇది స్థూలంగా శల్య పర్వాంతర్గతమైన భారత కథ.

## సౌప్తికపర్వం

అశ్వత్థామ ఆరాత్రి కృతవర్మ కృపాచార్య సహితంగా ఒక వట వృక్షం క్రింద చేరినాడు. పాండవుల మీద పగబట్టిన అశ్వత్థామకు నిదుర పట్టలేదు. మర్రిచెట్టు మీదికి ఒక ఉలూకం వచ్చి నిదురపోవుచున్న కాకుల్ని-

కొన్నిటి కంఠముల్ నులుపుఁ గొన్నిటి కాళులఁ ద్రుంచు నుగ్రతం
గొన్నిటి పక్షముల్ నఱకుఁ గొన్నిటి పొట్టలు వ్రచ్చు లీలమైఁ
గొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ నుఱుమాడు నిట్టుల
య్యన్నిటి నయ్యులూకము రయం బెసఁగన్ వధియించె...(సౌప్తిక1-18)

నిద్రలోని కాకుల్ని ఉలూకము చంపిన దృశ్యం అశ్వత్థామను కార్యోన్ముఖుని చేసింది 'నిద్ర వోవంగ శత్రుల నిగ్రహింతు'. 'నిద్రవోయెడు నవసరమున' శాత్రవుల బెట్టుపైఁ బడి చంపవలయు' అను నీతి వాక్యము అంగీకృత క్షత్ర ధర్ముండగు వానికి కర్తవ్యంబు, 'మజ్జనకహనన సంతుష్టుండగు ధృష్టద్యుమ్నుండు లోనైన యప్పాపాత్ములఁ బాపంబు తెరువున రూపుమాపెద. దీనంజేసి కీటజన్మంబు పొటమిల్లినను మేల. నన్నువారింప నెవ్వని వశంబగునని' దిగ్గున లేచి, భూతాకృతిగా తోచిన శివుని సంప్రీతుని గావించి శివు డిచ్చిన ఖడ్గాన్ని స్వీకరించి పాండవశిబిరాన్ని ప్రవేశించి నిద్రాపరవశుండగు ధృష్టద్యుమ్నుని, 'పశువుఁ జంపెడు చాడ్పున' చంపినాడు. ద్రౌపదీతనయుల నైదుగురిని. శిఖండిని, ఇతర సైనికుల్ని, కరితురంగాలను, వధించి పాండవ శిబిరాలను 'పీనుంగు పెంటలు' గా చేసినాడు. కృతవర్మ కృపాచార్యులతో అశ్వత్థామ సూర్యోదయాత్పూర్వమే దుర్యోధనుని చేరి తాను చేసిన ఘన కార్యాన్ని విన్నవించి సంతుష్టుడైనాడు. రారాజు సంతోషించి 'మీరు కృత కృత్యులరు సుఖులై యుండుడు పునర్దర్శనంబు త్రిదివంబున నయ్యెడు గాక', అని ప్రాణంబులు విడిచినాడు అంతలో సూర్యోదయమైంది.

ధర్మరాజు తన పుత్రులు అశ్వత్థామచే చచ్చుట విని విలపించినాడు. ద్రౌపది భరింపరాని పుత్రశోకంతో అశ్వత్థామను వధింపనిచో ప్రాయోప వేశంతో ప్రాణాలు విడుతునని భర్తలను హెచ్చరించింది. భీముడు అశ్వత్థామ శిరోరత్నాన్ని తెచ్చి యిచ్చి ద్రౌపదికి ఊరట కలిగించినాడు. బాలఘాతి అయిన అశ్వత్థామను దుర్గంధ శరీరంతో మనునట్లు శ్రీకృష్ణుడు శపించినాడు. ఇది స్థూలంగా సౌప్తిక పర్వంలోని కథా స్వరూపం.

## స్త్రీపర్వం

దుర్యోధనుని మరణంతో భారత సంగ్రామం ముగిసింది. పద్దెనిమిది అక్షౌహిణుల సేన హతమైంది. భారతేతి వృత్తమందలి ముఖ్యఘట్టం సమాప్త మైంది. పుత్రశతాన్ని పోగొట్టుకొన్న ధృతరాష్ట్ర గాంధారీ దంపతులు, వైధవ్యప్రాప్తి పొందిన కౌరవ స్త్రీలు శోకమూర్తులైరి. నవవధువగు ఉత్తర కూడ కౌరవస్త్రీలతో సమదుఃఖభాగిని అయింది పుత్రశోకం, బంధుమిత్ర మరణ వేదన పాండవులకూ తప్పలేదు. నిర్వేద శోక విషాద నిస్పృహ పరితా పాలతో సజీవంగా నిలిచిన వారందరి హృదయాలు పరితప్తములైనవి. అందరికీ ఏడ్పులు, ఓదార్పులు. ఇక జరుగ వలసినది రణరంగంలో మరణించిన వారికి పరలోక క్రియలు. గాంధారీ ధృతరాష్ట్రాదులు కుంతీసహితంబుగా యుద్ధభూమికి వెళ్లారు. అక్కడ ధర్మరాజాదులు ఆ వృద్ధదంపతులకు కోపోపశమనం కావించడం; ధృతరాష్ట్రుడు భీముని నుగ్గుచేయడానికి ప్రయత్నించడం; యోధుల కళేబరాలతో నిండిన రణరంగంలో శ్రీకృష్ణుని వెంట బెట్టుకొని తిరుగుతూ గాంధారి కోడళ్లశోకాన్ని తనశోకాన్ని కన్నీరు మున్నీరుగా హృదయ విదారకంగా శ్రీకృష్ణునికి వ్యక్తం చేయడం; కురువంశ నాశన జనకమైనట్టి యుద్ధాన్ని ఆపగలిగీ ఆపలేని శ్రీకృష్ణుని చివరకు గాంధారి శపించడం; కర్ణుడు తన కుమారుడని కుంతీదేవి ప్రకటించడం—ఈపర్వంలోని ముఖ్యఘట్టాలు. కరుణరస ప్రధానమైన ఈ పర్వంలో కథాగమన భాగం తక్కువ; పూర్వకథాపునశ్చరణ భాగం ఎక్కువ. అది పునశ్చరణమే గాని పునరుక్తికాదు. స్త్రీపర్వకథానువాదంలో తిక్కన కల్పించిన సన్నివేశాలు, నిర్వహించిన సంభాషణలు, పాటించిన పాత్ర పోషణావిధానం అత్యద్భుతం,

అసదృశం. తిక్కన భారత రచన అనువాదం కాదు, అది అపూర్వ కావ్య సృష్టి అనడానికి స్త్రీపర్వరచన కూడ ఒక దృష్టాంతం. పైగా ఛందో వైవిధ్యాన్ని తిక్కన పుష్కలంగా ప్రవేశ పెట్టిన పర్వం కూడా ఇదే.

## శల్యసౌప్తికస్త్రీపర్వాలు—తిక్కన కవితాశిల్పం

తిక్కన రచించిన పదునైదు పర్వాలలో యుద్ధషట్కం నిరుపమ కవితాశిల్ప శోభిత మంటే అత్యుక్తికాదు, వ్యాసభారతానికి పోల్చి చూచినపుడు యుద్ధ షట్క కథానువాదంలో తిక్కన ప్రదర్శించినంత ప్రతిభా స్వాతంత్ర్యాలు ఇతర పర్వాల విషయంలో చూపలేదేమో అనిపిస్తుంది. కవిబ్రహ్మ కవితా శిల్పం బహుముఖమైంది. తరచి చూచే కొద్దీ నవనవోన్మేషంగా ప్రసన్నమయ్యే శిల్ప మది. కవిత్రయ భారత కవితా ప్రాగల్భ్యాన్ని ప్రకటించే విమర్శకులు సాధారణంగా మూలంతో పోల్చి తులనాత్మకంగా పరిశీలించి తారతమ్యాలు సామ్య వైషమ్యాలు ప్రకటిస్తూ వుంటారు. మూలంతో పోల్చి చూచినపుడు తెలుగు భారత రచనలోని విధానాల్ని మూలానుసరణలు, మూలాతిక్రమాలు, కథా సంగ్రహవిస్తరణలు, కథోచిత వర్ణనలు, కథానుక్రమణికోల్లంఘనం, ఉపాఖ్యాన కథనావిధానం మొదలైన అంశాల క్రింద వివరించి చెప్పవచ్చు. ఈ పద్ధతి కొంతవరకు స్థూల దృష్టితో చేసే పరిశీలన. స్థూలదృష్టికి శిల్పస్వరూపం సుగమమౌతుందే కాని శిల్ప సౌందర్యం గోచరించదు. ముఖ్యంగా తిక్కన కవితా శిల్పసౌందర్య దర్శనానికి సూక్ష్మదృష్టి, లోతుచూపు అవసరం. తిక్కన రచనలో ప్రతిమాటను, ప్రతిపద్యాన్ని, ప్రతి ఘట్టాన్ని, ప్రతి పర్వాన్ని వ్యస్తంగానే కాకుండ సమష్టిగా, పూర్వాపరాలకు అనుసంధించి పరిశీలించినపుడు తిక్కన శిల్పం నిత్యనూతనంగా సజీవంగా సర్వాంగ సౌందర్యంగా ప్రసన్నమౌతుంది. ప్రస్తుతం తిక్కన రచనా పాటవాన్ని, కవితా శిల్పాన్ని శల్య సౌప్తిక స్త్రీ పర్వాల నుండి దిఙ్మాత్రంగా కొన్ని ఉదాహరణల్ని గ్రహించి పరిశీలిద్దాం.

తిక్కన స్వతంత్రించి అమూలకంగా రచించిన పద్యాల్ని వర్ణనల్ని కేవలం అమూలకాలని గుర్తించి ఊరుకోకుండ, అట్టి రచనల్లోని ప్రయోజనాన్ని లేదా ఔచిత్యానౌచిత్యాల్ని పరిశీలించడం అవసరం.

పద్దెనిమిదవ నాటి యుద్ధానికి శల్యుడు సేనానాయకుడు. సూర్యోదయమైంది. ఇరువైపులా సైన్యం మోహరించింది. జయించడానికి సర్వ సన్నాహంతో సర్వతోభద్ర వ్యూహాన్ని పన్ని శల్యుడు చివరి ప్రయత్నం చేస్తున్నాడు. ఈ సన్నివేశంలో సూర్యోదయాన్ని వర్ణిస్తాడు తిక్కన మూడు పద్యాల్లో. అమూలకమైన ఈ సూర్యోదయ వర్ణన శిల్పదృష్టితో చేసినట్టిది. ఆ మూడు పద్యాల్లో మొదటిది.

ఒండొరులన్ జయించు మతి నుద్భట లీలలఁ జాల నొప్పి య
ప్పాండవ కౌరవుల్ పెనఁగు భంగిఁ గనుంగొను వేడ్క నొక్క యీ
తండు మహాద్రి నెక్కెననఁ దద్దయుఁ జెన్నగు బింబ కాంతిన
ర్కుండభిరాముఁడై పొడుపుగొండపయిన్ వెలుఁగొందెఁ జూడఁగన్

(శల్య 1-114)

అంతకు ముందురోజు కర్ణుడు మరణించినాడు గదా. మరణించిన కర్ణుని సూర్యకిరణాలు స్పృశించినాయి. పుత్రశవ స్పర్శవల్ల సూర్యుడు మలినమైనడు. ఆనాటి సూర్యాస్తమయాన్ని తిక్కన

నిర్గత ప్రాణు రాధేయు నిజకరములఁ
గరుణ పెంపున నంటుట కారణముగఁ
బావన స్నాన మొనరింపఁ బోవునట్లు
లపర జలనిధి లోనికి నరిగె నినుఁడు (కర్ణ. 3-369)

అని వర్ణిస్తాడు. ప్రకృతిని కథా సన్నివేశానికి, పాత్రల మనోవృత్తికి అనుగుణంగా భావించి ప్రకరణోచితంగా వర్ణించడం తిక్కన ప్రకృతి వర్ణనల లోని ముఖ్యవిశేషం. ముందు రోజు అస్తమించిన సూర్యుడు మరుసటిరోజు ఉదయించినాడు. ఆరోజుతో కురుక్షేత్ర రణరంగంలో భారత యుద్ధం సమాప్తం కాబోతుంది. ఆ తర్వాత పాండవ కౌరవ యుద్ధాన్ని చూడడానికి అవకాశ ముండదు. కాబట్టి ఆనాటి యుద్ధాన్ని చూచే కుతూహలంతో సూర్యుడు 'మహాద్రినెక్కె' నట్లున్నాడని తిక్కన ఉత్ప్రేక్ష. ఇక రెండవ పద్యం:

అరసి యనాగతం బెఱుఁగు నట్టి మనంబులు గల్గు పాండు భూ
వరసుత బంధుమిత్ర కురువర్గ సుహృజ్జన కోటుల త్రతిం

బొరసె నతి ప్రమోదమును భూరి విషాదము నాఁగ నంబుజో
త్కరము వికాసమయ్యెఁ గుముదంబులు మీలన మొందె నెంతయున్
(కల్యా. 1-115)

సూర్యోదయంతో ప్రకృతిలో గల్గిన చైతన్యాన్ని, అప్పటి పాండవ కురు పక్షాలకు సంభవింప నున్న ఫలితాన్ని స్ఫురింప చేసేటట్లు రచించి యుండడం పై పద్యం లోని శిల్పం. పాండవులు అంబుజోత్కరములు, కౌరవులు కుముదములు. కౌరవ కుముదాలకు ఇక వికసించే అవకాశం లేదు. ఆనాడే రారాజు గూడ నేల కొరుగుతాడు గాబట్టి.

మూడవది సీస పద్యం కురుక్షేత్రంలో మోహరించిన చతురంగ బలాల మీద సూర్యకాంతి ప్రసరించిన విధాన్ని వర్ణించే పద్యం ఇది. చూపరులైన చదువరులకు రణరంగం యావత్తూ కళ్లయెదుట దృశ్యమాన మయ్యేటట్లు సూర్య కాంతిని రణరంగం మీద. ఉభయ సైన్యాల మీద 'ఫోకస్' చేసినట్లు వర్ణించిన పద్యమిది. ఈ మూడు పద్యాల తర్వాత వర్ణిత మయ్యేది భీకర యుద్ధం అట్టి సన్నివేశానికి పూర్వరంగంగా చదువరుల హృదయాలను ఆయత్త పరచడానికి సూర్యోదయ వర్ణనాత్మకాలైన యీ మూడు పద్యాల్ని తిక్కన ఉద్దేశించినాడని తోస్తుంది. పాత్రల మనోవృత్తినే గాక, పాఠకుల మనః ప్రవృత్తిని గూడ దృష్టి యందుంచు కొని రచన చేయడం తెలుగు కవుల్లో ఒక్క తిక్కనకే చెల్లు కాబట్టే ఎర్రాప్రెగ్గడ తిక్కనను ప్రశంసిస్తూ "తను కావించిన సృష్టి తక్కొరుల చేతం గాదు, కవిబ్రహ్మ నావినుతింతుం గవి తిక్కయజ్వ" నన్నాడు.

సౌందర్యం వస్తువును ఆశ్రయించి వున్న లక్షణంకాదు. అది ప్రధానంగా వ్యక్తి దృష్టిని ఆశ్రయించి నట్టిది. యోగదృష్టికి ప్రతివస్తువు దివ్యమైనట్లు, కళాదృష్టికి ప్రతి వస్తువు సుందరమే. తిక్కనది యోగికమైన కళా దృష్టి అతనికి సర్వమూ సత్యం, శివం, సుందరం. యుద్ధం భీకర భీభత్సావహమైంది కదా: కాని భీభత్సాన్ని కూడ రమణీయంగా దర్శించి దాని రామణీయకతను ప్రదర్శించే కవితాశిల్పం మనకు తిక్కనలోనే కన్పిస్తుంది. అందుకు అమూలకమైన ఈ క్రింది యుద్ధ వర్ణనను దృష్టాంతంగా చూపించవచ్చు.

నెత్తుటఁ దోఁగియు నిగిడి పోరెడు వీరు
లలరిన నడ మోదుగుల విధంబు

గ్రక్కునఁ దెగిపడి కదలెడు బాహు
దండములు మహా భుజంగముల భంగి
యవని రక్తాక్తంబులై యున్నయట్టిబల్
దలలు గెందామర కొలనిపగిది
దఱచుగా నెఱి దప్ప నొఱగిన గజములు
గులిశ భగ్నాచల కులమునట్లు

దునిసి తొఱఁగిన ఱోదుల తొడలు సామ
జముల కరములు నొండొంటి చందములుగ
నుంగొనగ వింతలగుటను సంగరాంగ
ణంబు రమణీయమును భీషణంబునయ్యె [శల్య 1-129]

ఏమి చెప్పుదు రౌద్రంపు చెనకమందు
దఱచు మెదళులు ఱొంపులు నుఱుములైన
యెమ్ము లిసుకయు సిత చామరమ్ము లంచ
లయ్యె రుధిరంపు టేఱుల కప్పుడధిప [శల్య 1-130]

వినుమ య్యేఱులలో వా
హనములె యోడలుగఁ జూడ నక్కజ మగు ను
క్కున నుద్దామ విహారం
బొనరించిరి వీర యోధు లుర్వీనాథా! [శల్య 1-131]

సాధారణంగా తిక్కన పనిబట్టి శబ్ద చమత్కృతుల జోలికి పోడు పోయినా వానిని తెచ్చి అతికించినట్లు చూపడు. అమూలకమైన ఈ క్రింది పద్యంలో ఆహా! హాహా; శబ్దాల మీద తిక్కన చూపిన చమత్కారం సహజం, శిల్ప శోభితం

వ్యూహాభావము సూచి నన్నసదుగా నూహించెదో భీమ మ
ద్బాహా చండిమ సార దుర్దమ గదాదండంబు దృప్యద్భవ

ద్దేహోల్లాసము నెట్టు దీన దశకుం దేనోపునో చూడు మీ
యాహా పుట్టెడు లాఁతి చూపఱకు హా హా పుట్టు మీవారికిన్
[శల్య 2-248]

శార్దూలవృత్తంలో నడచిన ఈ పద్యం తిక్కన వృత్తౌచిత్యానికి కూడ ఒక ఉదాహరణగా నిలుస్తుంది. ఇట్టి వృత్తౌచిత్యాన్నే అశ్వత్థామ ద్రౌపదేయులైన ప్రతివింధ్య శ్రుత సోమాదుల్ని సంహరించిన ఘట్టంలో పాటించి యున్నాడు. ఆ ఐదుగురు వధ ఐదు లయగ్రాహి వృత్తాల్లో రచించినాడు తిక్కన.
[చూ. సౌప్తిక 1-181, 183, 185, 187, 189.]

భీముడు దుశ్శాసనుని ఱొమ్ము నెత్తురు త్రావినట్లు శల్య సౌప్తిక స్త్రీ పర్వాలలో పలుమార్లు చెప్పబడింది. కర్ణవధానంతరం కృపాచార్యుడు దుర్యోధనుని ఇకనైనా సంధి ప్రయత్నం చేయుమన్నపుడు దుర్యోధనుడన్న మాటలు

నేఁడు దుశ్శాసనుని ఱొమ్ము నెత్తు రనిల
సుతుఁడు ముదమునఁ ద్రావుట సూచి కోఱఁత
ప్రతిన దీర్చు నతండని భయముఁ బొంది
పొందుగోరిన నది యేల పొసఁగు జెపుమ. (శల్య. 1-66)

ఇది మూలంలో లేదు.

దుర్యోధనునితో గదాయుద్ధానికి భీముణ్ణి పురికొల్పుతూ కృష్ణుడు రక్తపాన ప్రశంస చేస్తాడు.

వాలి దుశ్శాసనుని ఱొమ్ము వ్రయ్యఁ జీరి
నీవు నెత్తురు ద్రావంగ నిన్ను నతఁడు
చూచు చుండియు వెఱసొచ్చి క్రుక్కెఁగాక
కవియఁ జాలెనె నీపయిఁ బవనతనయ. [శల్య. 2-124]

ఇది కూడ అమూలకమే

ఇంకను రెండు మూడు చోట్ల రక్తపాన ప్రశంస కలదు అమానుషమైన ఈ సంఘటనను తిక్కన పలుమారు ప్రస్తావించుట కథాగతికి పాత్రల

మనోభావ వ్యక్తీకరణకే గాంధారి పౌరికలను వెళ్లినపుడు భీముడు కోపోప శమనంబుగా సమాధానం చెబుతాడు అపుడు గాంధారి

వైరి ననిఁ జంపుదురు గాక వ్రచ్చి నెత్తు
రెత్తికొని క్రోలు క్రూరాత్ము లెచట నైన
నెన్న డేనియుఁ గలిగిరే యీవు దక్క
నది వృకోదర వృక విధ మసుర భంగి. [స్త్రీ. 1-162]

అని భీముణ్ణి దూషించింది. దానికి భీము డిచ్చిన సమాధానమిది.

జలధరవృత్తం. ఆ సభలోని కట్లు ద్రుపదాత్మజఁ దాఁ
గాసిగ నీడ్చి వల్వొలువఁ గినుకం
జేసిన బాసకై పెదవిఁ జేర్చితి దు
శ్శాసను శోణితం బిది నిజం బరయన్. [స్త్రీ. 1-164]

గాంధారికే గాక పాఠకులకు కూడా భీముని యెడ సదభిప్రాయాన్ని కల్గించడానికి తిక్కన కూర్చిన మాటలివి.

భీముడు నటించిన దుశ్శాసన రక్తపానం, కావించిన దుర్యోధన ఊరు భంగం తన ప్రతిజ్ఞలను తీర్చుటకే అని భీముడు అన్నమాటలకు గాంధారి అడిగిన ప్రశ్న ఎంత వాడిదో చూడండి

అంధులకు నూఁతకోలగా నకట యొకని
నైన నిలుపక నూర్వుర నదయ వృత్తి
మ్రింగి తం దెవ్వఁ డేనియు మీకు నెగ్గు
లాచరింపని వాఁడు లేఁడయ్యె నయ్య. [స్త్రీ 1-170]

ఒక్కరుని నీవు సంపక
తక్కిన నంతటనె ప్రతిన దప్పునె విభవం
బెక్కఁగ మీయన్న నతం
డెక్కటి రాజ్యంబు సేయ నీఁడె కుమారా.

పుత్ర పౌత్ర వధ సంపీడిత స్వాంతన యగు గాంధారి నోట వచ్చిన మాటల్లోని శిల్పం ఎంత సహజ రామణీయకమో చూడండి. వెంటనే క్రోధ పరుషాక్షరంబులతో 'అమ్మహారా జెచట నున్నాడ'ని అడుగుతుంది ఆ మహారాజు మరెవ్వరు. మన ధర్మరాజేకదా.

తిక్కన రచన నాటకీయ మైనదని అందరూ అంటున్న మాటే. సంభాషణాత్మకమైన రచన వల్ల నాటకీయత సిద్ధించవచ్చు. కాని తిక్కన రచన లోని నాటకీయత అంతమాత్రానికే పరిమితమైందికాదు. ఒక సన్నివేశాన్ని కల్పించి అందు పాత్రలను ప్రవేశ పెట్టించి వారి మాటలనేగాక వారి అవయవాల కదలికను, సందర్భోచితమైన వారి ప్రవర్తనా సరళిని వారి చిత్తవృత్తులు బాహిరంగా వ్యక్తమయిన విధానాన్ని సంభాషణల్లోను ఉత్తరప్రత్యుత్తరాల కూర్పుల్లోను సహజమైన తెలుగు నుడికారాన్ని పొల్లుపోకుండ కళ్లకు కట్టినట్లు చిత్రించడం తిక్కన రచనలోని మహత్తర శిల్పం.

దుర్యోధనుడు తొడలు విరిగి పడ్డాడు. ఈ వార్త విన్న గాంధారీ ధృతరాష్ట్రులు పాండవుల్ని శపించ వచ్చు. అట్టి ప్రమాదం జరగకముందే వారిని ఓదార్చడం ఉచితమని కృష్ణుడు హస్తినాపురానికి వెళ్లాడు. మొగసాలలో నిలిచినాడు. ఆంబికేయునకు తన రాక ఎరిగించినాడు. అప్పటికే కృష్ణద్వైపాయనుడు గాంధారీ ధృతరాష్ట్రుల్ని ఓదార్చడానికి వచ్చి ధృతరాష్ట్రుని చెంత ఉన్నాడు. లోపలికి ప్రవేశించిన శ్రీకృష్ణుడు "కృష్ణద్వైపాయన మహామునింగని, వినయ సంభ్రమంబులు దలకొనఁ దత్పాదంబులకుఁ బ్రణమిల్లి, యక్కురురాజునకు గాంధార రాజనందనకు నమస్కరించి కులపతి సన్నిధి యగుట నిలా తలంబున గూర్చున్న యజ్ఞనాథు సమీపంబున నాసీనుండై" నాడట. వేదవ్యాసుడు కులపతి కాబట్టి అతన్ని ఉన్నతాసీనుని చేసి ధృతరాష్ట్రుడు నేల కూర్చొని వున్నాడు. ఇది మర్యాద. అక్కడికి వచ్చిన కృష్ణుడు ఉచితాసనాన్ని ఆశించకుండ నేల కూర్చున్న రాజు చెంత కూర్చున్నాడు. కృష్ణుడు నేల కూర్చున్నాడని వాచా చెప్పక ధ్వనింప జేసినాడు తిక్కన. ఆవిధంగా ధృతరాష్ట్రుని ప్రక్కన కూర్చున్న శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని చేతుల్ని పట్టుకొని కంట తడిపెట్టి మాటలు గొంతులో కొట్టుకుంటూ వుండే తన దుఃఖాన్ని మాటలతో కాదు అభినయంతో ఇట్లు వ్యక్తం చేసినాడు.

అన్న రేంద్రుపాణి యల్లన తన కరా
బ్జమునఁ గీలు కొల్పి బహుళ బాష్ప
కలిత వదనుఁడగుచు గళమున నెలుఁగురి
యాడ వగచి యమ్మురాంతకుండు. [శల్య 2-361]

దుఃఖాన్ని ఇట్లు ప్రకటించిన కృష్ణుని ఓదార్చడానికి ఎవరూ పూను కోలేదు. పూనుకొని వుంటే వేదవ్యాసుడే పూనుకోవాలి. ఆమహర్షికి కృష్ణ తత్వం కరతలామలకమే. అత డూరుకున్నాడు. ఇటు అటు చూచి కృష్ణుడు 'తత్ప్ర దేశంబున నున్న కనక కలశ జలంబుల ముఖప్రక్షాళనంబు' చేసుకొన్నాడు. గొంతు సవరించుకొని ధృతరాష్ట్రుని ఉద్దేశించి ఇట్లన్నాడు.

అకట కులం బకారణమ యంతయు నాశమునొందె నిట్టిదా
నికిఁ జొర నొల్లరైరి మహనీయచరిత్రులు నాఁడు పాండవు
ల్సకలము నీ వెఱుంగుదు చలంబును నీసును దక్కి నన్ను సం
ధికి నటరా నొనర్చుట మది దలపోయు మదెట్టి శాంతియో.

[శల్య 2-363]

ఆతర్వాత కౌరవులు పాండవులకు గావించిన దుండగాలను—మాయా ద్యూతం, ద్రౌపదీ వస్త్రాపహరణం, పాండవుల అజ్ఞాత వాసక్లేశం, తన సంధి ప్రయత్నం, పాండవు లొక్కొక్కరికి ఒక్కొక్క ఊరునైనా ఇమ్మని కోరడం-ఇవన్నీ చెప్పి "నీ కొడుకు లెమ్మెయి మానర లోభగర్వముల్, నీవును నట్ల కాక మహనీయమతుల్ విదురాది బాంధవుల్, వేవురు సెప్పరే యధిపచింటె తగం బలు కొక్కఁ దేనియున్" అన్నాడు. ఇంతకు దుర్యోధన వధ వార్తను కృష్ణుడు చెప్పలేదు. దుర్యోధనుడు కాలోపహత మనస్కుడు. "తలపోయ నుడుపం జాలుదురే నరులు దైవ సంపాదితముల్" అని విధిని ప్రస్తావించి "పాండవులు కల్మషాయత్తచిత్తులు గామియు మీరు నెఱి లేమియు విచారింపుము, ఏనుమ్రొక్కి వేడికొనియెద, వారల దెసం కోపంబు లేకుండ వలయును" అన్నాడు. ఇంతకూ దుర్యోధనుని పేరు ప్రస్తావించకుండా "నీకును గాంధారికిని వలయు పరలోక క్రియా కలాపంబులు వారి (పాండవులు) యందనిలిచె కావున వారికి శుభంబు గోరుటలెస్స" అని హితబోధచేసి గాంధారితో "నీకెనవచ్చు రాజరమణిన్ ధర

నెందు గంటిమే" అని ముందు పొగడి "కీడు పుట్టునని నీవు సెప్పితి చెప్పిన మాటయుం దలకూడెఁ బాండవుల వలనం దప్పులేదని యెఱుంగుదు గాదె, వారల కలుగకుండునది. నీ వలిగి చూచినం ద్రిలోకంబులు భస్మీభూతంబులగు నట్టి తపః ప్రభావంబునం బ్రసిద్ధవు గావున నిన్నుం బ్రార్థించెద" అన్నాడు. 'పయి చీర చెఱంగు మొగంబున నదిమికొని యేడ్చిన' గాంధారిని కృష్ణుడు ఓదార్చి వెళ్తాడు.

అశ్వత్థామ సౌప్తికవేళ పాండవశిబిరం ప్రవేశించి నిద్రితులైన ధృష్టద్యుమ్నుని, శిఖండిని, ద్రౌపదేయుల్ని పశుమరణంగా తాను సంహరించిన వార్తను మరణావస్థలో నున్న దుర్యోధనునికి చెప్పి వ్యాసాశ్రమానికి వెళ్ళి పోతాడు. పుత్రశోకార్తయైన ద్రౌపది అశ్వత్థామను వధించని యెడల ప్రాయోపవేశంతో మరణిస్తానని చాటింది. భీముడు ధర్మజ ధనంజయ కృష్ణులతో అశ్వత్థామను అన్వేషిస్తూ వెళ్ళినపుడు వ్యాసాశ్రమ ప్రాంతంలోని ముని వేషధారిగా మారిన అశ్వత్థామ భీముని కంటబడ్డాడు. ఆ సన్నివేశాన్ని తిక్కన చిత్రించిన విధం చూడండి.

మేన భసిత మలఁది మాననీయ తపః ప్ర
యుక్తి నాదరించి యున్న ద్రోణ
తనయుఁ గాంచి చాపదండంబు సజ్యంబు
సేసి మహితశరముచే నమర్చి (సౌప్తిక. 2-57)

వ. భ్రుకుటిత వికట ఫాలభాగుండై (సౌప్తిక. 2-58)

ఓరి ధాత్రీసురాధమః క్రూర కర్మ
కపటధార్మికః యత్యంత కల్మషాభి
యుక్తిఁ బోయినరేయి మహోగ్రవృత్తిఁ
దగిలి తెంత వేగిరమునఁ దపసివైతి. (సౌప్తిక. 2-59)

వ. ఇట్టు లొదిఁగినఁ జావు దప్పునే లే లెమ్ము తపమ్ము సాలు రణమ్మునకు రమ్మని కఠినాక్షరంబులుగాఁ బలికె. (సౌప్తిక. 2-60)

భీమునిలో కపటంలేదు. అతని మాటలు కట్టె విరిచినట్టుంటాయి.

మాటలకు మెరుగు పెట్టి మెత్తగా మాట్లాడడం భీముడు నేర్వని విద్య. ఆ విద్యతో అన్నగారైన ధర్మయ్యేదే పై చేయి.

దుర్యోధనుని మరణంతో, అశ్వత్థామ పలాయనంతో భారత సంగ్రామం ముగిసింది. పదునెనిమిది అక్షౌహిణులసేన మడిసింది. యుద్ధంలో పుత్ర పౌత్ర సఖి సుహృత్సహాయులందరిని పోగొట్టుకొన్న ధృతరాష్ట్రుడు 'ఎఱకలు (రెక్కలు) విఱిగిన గరుఁడుని తెఱగు' న వున్నాడు. 'ఆకంగూరిన శోక' మూర్తి అయిన ఆ అంధరాజు కృష్ణద్వైపాయనుని శోకోపశమన వాక్కులతో కర్తవ్య బోధతో శాంతమూర్తి అయ్యాడు.

ధరియించెదఁ బ్రాణము మది
నెరియక యుండంగ శోక మేఁ దొఱఁగెద ని
ర్భర బాంధవ్యంబు నొందెదఁ
బురుషోత్తములైన పాండుపుత్రకుల దెసన్ (స్త్రీ. 1-94)

అని పలికి, "గాంధారిని కుంతిని తక్కుంగల కౌరవ వధూ వర్గంబు"ను వెంటరమ్మని కురుక్షేత్రాన్ని చేరినాడు. అది కురుక్షేత్రం కాదు-కళేబర క్షేత్రం. పారాశర్యమునీంద్రుని వరప్రసాదంతో గాంధారికి కలిగిన తాత్కాలిక దివ్యదృష్టికి సువిశాలమైన ఆ కళేబరక్షేత్రం సుగోచరమైంది. ఆమెకు గోచరించిన రణభూమిని తిక్కన పాఠకులకు ఐదు లయగ్రాహివృత్తాలలో (స్త్రీ2-4, 5, 6, 7, 8) ప్రత్యక్షీకరింప చేసిన రచన అత్యద్భుత శిల్ప శోభితం. జుగుప్సావహమూ భీభత్సకరమూ అయిన పెక్కు దృశ్యాలను తిక్కన సాహిత్య రసిక మనోభిరామంగా వర్ణించినాడు. ఐదు లయగ్రాహి వృత్తాల ననుసరించి వున్న ఈ క్రింది వర్ణనను పరిశీలించండి.

ప్రేవులు గండలు పెఱికి వేటాడి యంగదఁ గొని మెదళు లగల్చి కొనుచు
రాగిలి రక్తంబు ద్రావుచు లోచనగుళికల నొలిచి మ్రింగుచును గుండె
కాయ లాదట మెయిఁగబళించుచును గ్రొవ్వుదెమలిచి నమలుచునెముకయూట
చవిగొనియానుచుఁజావకయున్న రూపులుసచ్చుటకుఁ గాఁగఁబెలుచఁదన్ని

కొనిన వెఱఁబాయఁ బాఱుచుఁ జెనకి తొడరి
కాటు లాడుచు నున్న సృగాలములును

గాకములు రావులుఁగులును గ్రద్దలునువ్వ
కంబులును మానసంబు వికలంబుసేయ. (స్త్రీ. 2-9)

కౌరవస్త్రీలు నాథజనక పుత్ర సోదర శవములను సమీపించి గుర్తించడానికి పడిన యవస్థ ఇది

అవయవములు రూపఱఁగఁ గ్రవ్యాద భక్షి
తంబులై యున్కిఁ గొన్ని శవంబు లువిద
లెంత సూచియు నవి గొంద తెలుఁగఁ జాల
రయ్యెదరు సూడు తమబంధు లగుటఁ గృష్ణ. (స్త్రీ. 2-23)

గాంధారి దుర్యోధనుని కళేబరాన్ని చూసింది. చూసి 'నఱకిన యనఁటి క్రియన్' మూర్ఛిల్లింది. కొంతసేపటికి తెలివి తెచ్చుకొని పరిచారికలు చేయూత నివ్వగా పుత్రునిశవాన్ని సమీపించి తరల మనస్కయై

తరల. విపుల వక్షము మీఁద నశ్రులు వెల్లిగొల్పుచు వ్రాలి యో
నృపతికుంజర కౌరవేశ్వర నేల నిమ్మెయి నీయుదా
త్తపు శరీరముఁ బొందఁబాడియె తల్లివచ్చినభక్తితో
నుపచరింపక లాఁతివై యిటు లూరకుండుట యుక్తమే. (స్త్రీ. 2-27)

అని పలవించింది.

స్త్రీ పర్వంలో తిక్కన చేసిన మృతవీరుల శవవర్ణనలో స్వీయ ప్రతిభాన్వితమైన భావనారీతులు కొల్లలు. ఉదాహరణకు కొన్ని:

దుర్ముఖుని ముఖాన్ని నక్కలు తోడేళ్లు సగం తిని వదలి పెట్టినాయి. తల్లి అయిన గాంధారి ఆ ముఖాన్ని చూసి, సప్తమి చంద్రబింబంగా భావించింది

నక్క తోఁడెలు వీని యాననము సగము
దిన్న యవి యట్టులయ్యును నున్న యొప్పు
దొరసి సప్తమినాఁటి చందురునిఁ బోలె
చూడు భావించి దీపితశూరవంశ. (స్త్రీ. 2-68)

కర్ణుని ముఖాన్ని కూడా కాకులు గ్రద్దలు తిని కొంచెం వదలి పెట్టినాయి. ఆ వర్ణన చూడండి

కాకులును గ్రద్దలును దిన్నఁ గడమ ద్రెస్సి
యపరపక్షచతుర్దశి యమృతకరుని
కరణి నొప్పెడు కర్ణు మొగంబు మీఁద
వనిత యందంద మోపెడుఁ దనమొగంబు. (స్త్రీ. 2-93)

శల్యుని కళేబరం బోరగిల పడివుంది. నాలుక వెలుపలికి వచ్చివుంది. కాకులు ఆనాలుకను పొడిచితింటున్నాయి.

బోరగిలఁ బడ్డవాఁడు గపోల మొకటి
పుడమి మోచినయది మోము పొలుపు సెడదు
వీఁడె సూచితె శల్యుండు వెడలి యున్న
జిహ్వ దినియెడు వాయసశ్రేణి కృష్ణ. (స్త్రీ. 2-108)

కౌరవులకు పాండవులకు గురుపాదులైన ద్రోణుని పాదాలకు బట్టిన గతిని తిక్కన వర్ణించిన విధం చూడండి.

తోటకము. సతతంబును శిష్యులు సద్వినయా
న్వితులై ప్రణమిల్లెడు వీర పద
ద్వితయంబు గడుం జెడఁ దిన్నవి సూ
చితె నక్కలు దైవము చెయ్దిఁ గటా. (స్త్రీ. 2-122)

తిక్కన రచనలో ప్రతి పద్యమూ ఆలోచనామృతమయం. పాఠకావళికి మోదదాయకం.

తిక్కన కూర్చిన తెలుగు పదబంధాలు కూడా అతి మనోహరం. ఉదాహరణకు కొన్ని:

చేతిబరువు = భుజబలం
అనిపని = రణక్రీడ
గెలుపునుబ్బు = జయోత్సాహం
ఇర్లవారము = అంధకారము
చీకురాజు = ధృతరాష్ట్రుడు
అఱుగు దెవులు = క్షయరోగఁ

భాషాదృష్టితో పరిశీలించే వారికి తిక్కన భాష ఒక తరగని గని. అందు లభించే మణులు అమూల్యములు.

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు ఆంధ్రమహాభారతాన్ని ఆంధ్రు లందరికీ అందుబాటులో వుండేటట్లు ప్రచురించడానికి పూనుకోవడం అభినందింప దగిన విషయం. శల్య సౌప్తిక స్త్రీ పర్వాలను కొంత పరిష్కరించి, సంగ్రహమైన ఈ పీఠికను వ్రాయడానికి నాకు అవకాశాన్ని కల్పించినట్టి అకాడెమీ అధికార వర్గానికి నా కృతజ్ఞత.

నల-విజయదశమి

జి. యస్. రెడ్డి



# విషయసూచిక

## శల్యపర్వము—ప్రథమాశ్వాసము



## శల్యపర్వము—ద్వితీయాశ్వాసము

## సౌప్తికపర్వము ప్రథమాశ్వాసము

## సౌప్తికపర్వము-ద్వితీయాశ్వాసము



## స్త్రీపర్వం - ప్రథమాశ్వాసము

## స్త్రీపర్వము - ద్వితీయాశ్వాసము





# శ్రీమదాంధ్ర మహాభారతము

## శల్యపర్వము - ప్రథమాశ్వాసము



శ్రీగిరిజాసమవాయమ
హాగురుతరశుభగసంపదాలంబసదా
యోగిజనక్షేమసమీ
హాగర్భితదివ్యచిత్త హరిహరనాథా. 1

క. దేవా జనమేజయధా
త్రీవల్లభుఁ డుత్సుకత్వరేఖాసౌమ్య
శ్రీవిలసితుఁ డై యిట్లనుఁ
దా వైశంపాయనున కుదాత్తవినీతిన్. 2

క. దురమున నమ్మెయిఁ గర్ణుఁడు
పరిమార్పంబడిన నల్పపరిజనుఁ డై య
క్కురుపతి యజయ్యు లగున
య్యరులయెడం బిదప నెట్టు లయ్యె మునీంద్రా. 3

తే. ఏను మును విన్నయక్కౌరవేంద్రపాండు
విభుతనూజులచరితంబు వేడ్కఁ బెంచెఁ
జెవులతియ్యంబు దళుకొత్తఁ జెప్పు మనఘ
వారి దైనయనంతరవర్తనంబు. 4

వ. అని యడిగిన వైశంపాయనుం డమ్మహీనాయకున కిట్లనియె నట్లు
కర్ణుండు దెగిన దుర్యోధనుండు హతావశిష్టవసుధావరులు పరివేష్టింపఁ
గొంచెపుమూఁకలతోడ విడిదలకుం జని సుహృజ్జనంబులు దేర్ప విషాదం
బుడిగి సముత్సాహబోహళి యై శల్యునిం దనకు సేనాపతిఁ గావించి
వేగుటయు బలువు బొలుపును వెలయఁ బోరికలనికి నడచెఁ బాండ

వేయులును బలంబుతోడం బన్ని యేతెంచిన నయ్యిరువాఁగునకు సురాసురసమరంబునుం బోని సంగ్రామంబయ్యె నంత మధ్యాహ్నంబున నమ్మద్రపతి యుధిష్ఠిరుపరాక్రమంబునం దెగియెఁ బదంపడి భటులుం జెలులుఁ జుట్టంబులును సమసిన నుక్కుదక్కి యక్కురువిభుం డనిపని సాలించి పెఱఁ బోఁడెడు దెసంబుతో నొక్కరుండు దొలంగం బాఱి యొక్కమడువు సొచ్చి దాఁగి యుండె నట గెలుపునుబ్బునం బొంపిరి వోవుపాండవేయు లతం డందునికి యెఱింగి యయ్యెడకు నరిగి నలిరేఁగి చుట్టుముట్టి పిలిచిన వెడలి వడముడితోడి పెనంకువం బెద్దయుం బ్రొద్దు పెనంగి యా భూనాథుండును బ్రొద్దు సోల వాలినప్పుడు భీము గదాఘాతంబునఁ దొడలు విఱిగి పడియె నంత నిశాసమయంబున నశ్వత్థామ గృపకృతవర్మలు దనకుందోడుగా ధర్మనందనస్కంధావారంబు బొడివి పాంచాలప్రభద్రకమాత్స్య ప్రభృతిశేషసైన్యంబుల సమయించె మఱునాఁడు సంజయుండు కురుక్షేత్రంబు నందుండి పూర్వాహ్ణంబునఁ గరినగరంబున కరుగుదెంచి. 5

చ. పొరిఁబొరి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁడై
చరణయుగంబు దొట్రువడ సంభృతశోకత రాజవీధి నె
వ్వరిఁ గని యైన హా మహితవైభవ హా ధృతరాష్ట్రపుత్ర హా
కరిపురనాథ యం చెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచున్. 6

క. జననయనచకోరానం
దనుఁ డగునృపచంద్రుఁ డనుచితం బయినవిధం
బున నస్తమించె నంచుం
దనుదోలనభరితభూరిదైన్యుం డగుచున్. 7

వ. చని ధృతరాష్ట్రమందిరంబు ప్రవేశించి లోపలికొలువున గాంధారియుం గోడండ్రును విదురుండును మఱియును దగుచుట్టంబులునుం బరివేష్టింపఁ గర్ణులేమికిఁ బ్రేముడించుపలుకులు నెల్ల నుల్లంబు దుఃఖిల్ల నున్న యన్నరనాథుఁ గని డగ్గుత్తిక వెట్టుచుఁ దనపేరు సెప్పికొని వేరి పాదప్రణామం బాచరించి యేడ్పు బెరయునెలుఁగుతో నిట్లనియె. 8

సీ. జననాథ శల్యుండుసమసె సౌబలుఁడుగీఁడడఁగె నులూకుండుమడిసెసకల
సంశప్తకులు గడచనిరి కాంభోజశతానీకములు దెగటాఱె యవన
పార్వతీయమ్లేచ్ఛబలములు ద్రుంగె నల్దిక్కుల మన్నీలుం దక్కగలుగు
నరనాయకులును జచ్చిరి కుమారులు గూయం..బుఁ దెగిరి కర్ణాత్మజులును

తే. బొలిసి రయ్య వృకోదరుపలుకు దప్ప
కుండఁ దద్గదాదండ ప్రచండనిహతి
రెండుదొడలును విఱిగి ధరిత్రిఁ బెలుచఁ
గూలి రూపఱి రారాజు ధూళి బ్రుంగె. 9

వ. మఱియు ధృష్టద్యుమ్నుండును శిఖండియు నుత్తమౌజుండును యుధామన్యుండును లోనుగాఁ గలపాంచాలురును జేదిమాత్స్యప్రభద్రక ప్రభృతి బలంబులు లోనుగా నవశిష్టసైన్యంబులును నీమనుమ లైనప్రతి వింధ్యాది ద్రౌపదేయులును సకలరథసామజఘోటకసుభటసమేతంబుగా మృతిఁ బొంది యిట్లు కౌరవశిబిరంబును బాండవస్కంధావారంబును విధివశంబున వనితావశేషంబు లయ్యె నిందుఁ గృపకృతవర్మలు నశ్వత్థామయుఁగా మువ్వురును నందుఁ బాండవు లేవురును గృష్ణసాత్యకులుగా నేడ్వురును భవత్సుతుం డయినయుయుత్సుండును శేషించి రివ్విధంబునఁ బదునొకండు నేడక్షౌహిణులు నఖిలక్షోణికి దుర్యోధను నధిపుఁ గావింపనుం జంపనుం బూను కాలం బగుటయు నాలంబున నిశ్శేషత్వంబు నొందె నని చెప్పుటయు నమ్మహీపతి మూర్ఛల్లె విదురుండును వివశుం డై యొఱగె గాంధారియుఁ గోడండ్రును జె య్యేది పుడమిం బడిరి తక్కటిచుట్టంబులు మొగంబులు మొగుడం జిత్రరూపంబు చందం బై రి సంజయ ప్రయత్నంబున నందఱుం గ్రమంబునం దేఱి రప్పుడు మేను వడంక నమ్మానవనాథుండు నలుదిక్కులకు మొగంబు ద్రిప్పి విదురు నుద్దేశించి పుత్రహీనుండ ననాథుండనగుడ యెఱింగితిఁ దమ్ముండ యిటమీఁద నీవ నాకు గతి యగు మనుచు మగుడ నిగుడుమూర్ఛాతిశయంబునం బరవశుం డయిన నతండును నారీజనంబును శీతాంబుసేచనంబులను లలితవ్యజనవీజనంబులను గొండొకసేపునకు సేద దేర్చినం గూర్చుండి యక్కురువిభుండు గుంభనిక్షిప్తభుజంగంబుచందంబున నిశ్వాసంబు

సీ. ఇటరమ్మ నన్నుఁ గౌఁగిటఁ జేర్చి కొడుక మీయమ్మ నూరార్పరావయ్య వృద్ధు
లగు మమ్ము విడుచుట దగునె యేగతిఁ బోవువారము సెప్పుము కౌరవేంద్ర
యంధనృపికలులనరయక యిట్లుపేక్షించితి నామీఁదఁ గృపయుఁ బ్రియము
నెక్కడ వోయె భూమీశులు గొలువంగ నుండు [2]దీ వట్లొంటి నున్న వాఁడ

తే. వధికబలదుర్నివారుండ వైననీకుఁ
బాండుపుత్రులచేత నప్పాటఁ జావు
వచ్చె నిచ్చలు భక్తిమై వచ్చి కొలిచి
గారవింప నిం కెవ్వరు గలరు నాకు. 18

వ. కయ్యంపుమాట పుట్టినయప్పుడు నీవు నాతోడ. 19

శా. చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు నశ్వత్థామయుం గల్గ నా
కీపాండుక్షితిపాలపుత్రకు లెదు రెం దెవ్వాఁడు గృవ్యద్భుజా
వ్యాపారుం డనిఁ గర్ణుఁ డొక్కరుఁడు మాయం జేయు మద్బాణవి
ద్యాపారీణత గెల్తు నొక్కరుఁడన యే నమ్మ్యపురః ప్రవేల్మిడిన్. 20

తే. మున్ను చెప్పినవారు గా రెవ్వఁ గలరు
నుమ్ము బాహ్లికభగదత్తసోమదత్త
శకునిభూరిశ్రవస్సుఁ శల్యసింధు
రాజవిందానువిందాదిరధికవరులు. 21

క. ఏనును గర్ణుఁడు దమ్ములు
నా నలువురు వీరు లైన నటు నూడు పృథా
సూనుల నెట్లు జయించెద
నో నమ్మము నాబలంబును గలితనంబున్. 22

క. అని యూఁబడిల్లఁ బలికిన
విని భవదీయానివార్యవిక్రమమునుఁ దాం
డునరేంద్రసుతులు వొడమర
యని తలఁచిరి నీవే తెగితె యప్పుడేన్. 23

క. [illegible] సం
హము గాక నరుఁడె పార్థుఁ [illegible]

సమయించె నట్లు జంబుక
సముని శిఖండిఁ గొని విధి కసాధ్యము గలదే. 24

చ. శరగురుఁ డట్టియోధుఁ డటె చచ్చె ననిన్ దొర గానివానిచే
వెరవున లావునన్ జనులు వెక్కస మందఁగఁ జేయుసింధుభూ
వరుఁ డటె రిత్త వోయె ననివార్యుల బాహ్లికసోమదత్తులం
బరు లవలీలఁ జంపె రటె పల్కెదు నే మని యేను దైవమున్. 25

క. నీనమ్మినభూరిశ్రవుఁ
డేనికలా వతఁడు నెందు నెన లేనిమగం
డైనభగదత్తుఁడును వ
మ్మైనతెఱం గట్టి యేమి యందుఁ గుమారా. 26

ఉ. నచ్చినకర్ణువిక్రమమునం బరవీరులయం దొకండునుం
జచ్చుట లేదు దుర్దమము శల్యభుజావిభవంబు లోకముల్
మెచ్చినయట్టి దందు నొకమేలు వినంబడ దమ్మహాత్ములం
బ్రుచ్చులఁ జంపినట్టులు పరుల్ దెగటార్చిరి దైవ మిచ్చినన్. 27

తే. కొడుక తమ్ములు దోడ్పడఁ గడఁగి శత్రు
వరుల గెలిచెద నంటివొక్కరుఁడుదక్క
కుండ నీతమ్ముఁగుఱ్ఱల నూచముట్టు
గొనియె నే విధి యేగతిఁ జనుదుఁ జెపుమ. 28

క. కడిసి పవనజుఁడు బెట్టుగ
గద వ్రేసినఁ దొడలు విఱిగి కయ్యపునేలన్
మద మఱి పడినప్పుడు నీ
మది నే మని తలఁచితో కుమార యెఱుంగన్. 29

వ. అని పెక్కుభంగుల విలపించి. 30

చ. తలఁపఁగ భాగ్యవంతుల కుదాత్తసుఖం బగుఁ గాక పుణ్యహీ
నుల కది గల్గ నేర్చునె తనూభవు లాజిఁ బోయి రింకఁ గా
ననఁ జరియింపఁ బోవుట యనా కుచితం బటు గాక చండి నై
నిలిచితి నేని మాటలనె నిచ్చలు భీముఁడు చూఁడు చుండఁడే. 31

క. విను దుర్యోధనదుశ్శా
సనులఁ బలికిపలికి నిచ్చ చావుగ నప్పా
వని యలఁచుఁ గాన నడవికిఁ
జనుటయు మేలైనతెఱఁగు సంజయ నాకున్. 32

వ. అని పలికి యత్యంతదుఃఖదూషితస్వాంతుం డగుచు నమ్మహీకాంతుండు
నిట్టూర్పు నిగిడించి యాసూతనందనున కి ట్లనియె. 33

క. సురసరిదాత్మజుఁడును శర
గురుఁడును గర్ణుండుఁ దెగుటకుం దలఁకక యె
వ్వరిబాహుబలము గొని యే
మరి కోల్తల నేసి రాకొ్కాఁ మనవా రనికిన్. 34

వ. అని తనకొడుకుచలం బూహించి. 35

చ. మును విదురుండు సెప్పె నతిమూర్ఖమనోగతి యైనయీసుయో
ధనుచరితంబు గీడఖిలధాత్రిజనక్షయకారిఁ బొనర్చునా
శన మని దానిఁ గొంద ఱవిచారులు పాటిగఁ బట్ట రైరి నా
కును మది వారికె ట్లటుల కుత్సిత మయ్యె విధాత్రశిల్పనన్. 36

క. అప్పు డటు లతఁడు సెప్పఁగఁ
దప్పఁ దలంచినఫలంబు దగఁ గుడువక పోఁ
జొప్పడునె సూతనందన
చెప్పు మనికి నెవ్వఁ డమకుసేనాపతి యై. 37

చ. దురమున నర్జునప్రకటదోర్విభవంబు నెదుర్పఁ జాలును
ద్ధరుఁ డొకరుండు గల్గెనె విఘాతవిరోధిబలుండు శల్యుఁ డె
వ్వరిభుజశక్తిఁ జిక్కెఁ గురువర్గము సంజయ మట్లు నెల్ల దు
స్తరబలభాసిభీమునిగదం బడియెం సుముఖుఁ డెమ్మెయిన్.

వ కృపకృతవర్మాశ్వత్థామ లెబ్బంగి బ్రతికిరి ధృష్టద్యుమ్న శిఖండి
ప్రముఖపాంచాలురును జేదిమాత్స్యప్రభద్రకప్రభృతిసంఘములును
నామనుమ లైనప్రతివింధ్యాది ద్రౌపదేయులును దక్కనుం గలుగుయోధ

వీరలు నెవ్విధంబున మృతిఁ బొందిరి పాండవు లేవురును బద్మనాభ సాత్యకులును యుయుత్సుండును నెత్తెఱంగునఁ దెగటారక తప్పి రింతయుఁ బరిపాటిఁ దేటపడం జెప్పు మనిన విని సంజయుండు ధృతరాష్ట్రున కి ట్లనియె. 39

ఉ. సూతసుతుండు జేయఁ గలవారలు దర్పసమగ్రభూపతి
వ్రాతముఁ బెక్కు దంతిరథవాజిభటావలులున్ భుజాబల
స్ఫీతులు పాండునందనులచేఁ దెగటారిన నోడి వీఁకికిన్
నీతనయుండు హీనరథినీయుతుఁ డై యటు లేఁగి నెవ్వగన్. 40

—: కృపాచార్యుఁడు దుర్యోధనునకు హితోపదేశంబు చేయుట :—

వ. మందిరంబుఁ బ్రవేశింపక యొక్కబయల నిఖిలబంధుమిత్రపరిజన వృతుం డై నిలిచె నయ్యవసరంబునఁ గృపార్ద్రచిత్తుం డై కృపాచార్యుం డన్నరేంద్రున కి ట్లనియె.

క. సమరము మిముబోంట్లకు ను
త్తమధర్మం బిడియ తొంటి ధాత్రీశులు కృ
త్యముగఁ గొని యాచరించిరి
తమకు సుగతి గోరి కీర్తితస్ఫురణమెయిన్. 42

క. ఐనను నొకపలు కద్దము
గా నొడివెద దాని లెస్స గా విని యది మే
లైనను జేసెదు గాదే
న్మానెద నేర్పడఁగ వినుము మనుజాధిపా. 43

చ. అమరనదీతనూభవుఁడు నస్త్రగురుండును గర్ణుఁడుం బరా
క్రమధనహానియు సాహసధురంధరు లట్టిర తక్కుఁ గల్గు భూ
రమణులు బంధుమిత్రులు దురంబున నందఱుఁ బొందుచుండుటల్
సమయఁగఁ జేసి రట్టి ఘనశక్తియు దైవబలంబు నెక్కుడై. 44

చ. వెరవును లావునుం గలుగు వీరులు పోరులఁ బడ్డ హీనసం
బొరసితి మస్త్రశస్త్రహతి పొందక చిక్కినవారు నొక్కఁడో
యిరి విను పాండురాజసుతు లేవురు గండికి నెప్పుడుం దమై
హరి తముఁ గావఁగా వెలసి రక్షితదేహవిలాససంపదన్. 45

క. శ్వేతాశ్వపాటవం బు
ద్ద్యోతిత మై మెఱయఁగాఁ జతుర్దంతరుచి
స్ఫీత మగుగజముక్రియ నరుఁ
డాతతకురుసైన్యసరసియందుఁ జరించున్. 46

క. జ్యారవము నాదముగ నతి
ఘోరత వైరు లనుకరటికోటికి రయదు
ర్వారం బగుసద్గుసుం
రీరవము శితాస్త్ర నఖపటిష్ఠతఁ జూపున్. 47

తే. అర్జునోద్యగ్రదవశిఖ హరిమహాని
లంబు ప్రేరేప వైరిబలప్రకీర్ణ
గహనదహనవిహార ముగ్రముగఁ జలుపఁ
దేఱిచూడను రాకున్కి యెల్ల మధిప. 48

ఉ. ద్రోణుఁడు సూతసంభవుఁడు ద్రోణతనూజుఁడు నేను శల్యుఁడుం
బ్రాణపరాయణత్వమున దర్పము సూపఁగ నీవుఁ దమ్ములున్
బాణపరంపరల్ గురియ ఫల్గుణుఁ డింపుగ మీఱె సైంధవ
ప్రాణము నాఁచికోలు సరసెం దలఁపఁగ నత్త్యకృత్యమే. 49

ఉ. ఇంతకమున్న సెల్లెఁ బదియేనుదినంబులసంగరం బతి
శ్రాంతతఁ గుంది రింపఁ గలసైనికు లద్దెసఁ గల్గుయోధు లా
క్రాంతవిరోధిదర్పుఁడు పురంధరనందనుఁ డొక్కరుండ ని
శ్చింతత నుల్లసిల్లెదరు చెప్పఁగ జెమ్పక కౌరవేశ్వరా. 50

క. బలవిక్రమములు లగుదౌర
లిలిగిన మనసేన మేదినీశ్వర వినుక
న్నులు సెడిపట్టున్నది యీ
కొలఁదిం బొరిగొనుట శత్రుసమితిన్ సుకర మగున్. 51

వ. అని చెప్పి కృతవర్మశల్యగురుపుత్రులకుఁ దన్ను సెన్ని. 52

క. దామోదరుకరుణచేతను
భీముఁడు నిరుగెలంకులుండఁ జెప్పె నిటుమ పు

ద్దామగతి నడరుకవ్వడి
కే మిఁదఱుఁ దలఁప నొక్కయెత్తు కుమారా. 53

చ. అనిలసుతుండు పూన్కి బలుపారఁగఁ గొండొక దీర్చె నేపు నాం
దినభుజసంపదం గొఱఁత దీర్పఁగ నింకఁ గడంగకుండునే
మనకు నజాతశత్రుని సమంచితమార్దవ మూఁది సంధి సే
య నుచితమైన కాలమిది యాగ్రహముం జొరనీకు చిత్తమున్. 54

క. సమరము నిష్కారణ వై
రమునం బాటిల్లె నెల్ల రాజులు భరతో
త్తములును మడిసిరి విడు కో
పము దీర్ఘక్రోధుఁ డైనపతి కీ డొందున్. 55

క. తమకు బలం బెక్కొనతఱి
సముచిత మగు విగ్రహంబు శత్రుల కుత్సా
హము మీఱినపుడు గర్త
వ్యము సంధి యనంగ విందు మార్యులచేతన్. 56

క. కలవా రెల్లను దెగి నీ
తలన నిలిచెఁ గార్య మధిప తగ నొడఁబడు మి
ట్టుల మగునాత్మవినాశము
కలుగుట యది విపులపాతకం బండ్రు బుధుల్. 57

క. తనకై కాదే మది నె
ల్లను గోరుట వినుము దాఁ బ్రళయ మొందెనయే
నిని వారనియుద్యోగం
బునకు ఫలం బేమి రాజపుంగవ చెపుమా. 58

క. నినుఁ గాచికొనుము నీ వు
న్నను సర్వము గల్గు ధర్మనందనునిఁ దగం
గను మతఁడు రాజ నని తన
మనమున నెక్కించుకొనఁడు మదగర్వంబుల్. 59

తే. రాజ్యభాగంబు దగ ధృతరాష్ట్రునకును
నీకు నన్నదమ్ములకు నానృపతి యొసఁగు
నాతఁడెపుడు శుశ్రూష సేయంగఁగోరు
గురుజనములకుఁగావునఁగూడు టొప్పు. 60

చ. హరియును గాఁ దనందు గరుణాన్వితులై తగ నమ్మహాత్ము లె
ప్పరుసునఁ గార్యనిశ్చయము వల్కినఁ గీచకవైరియుం బురం
దరతనయుండునుం గవలు దానికి మా ర్పలుకంగ నెమ్మెయిం
జొర రగు సంధి యెట్లు ననసూయత నూల్కొని చేయు మిత్రజిన్. 61

ఆ. ఇంత చెప్పు టనికి నే నోడి ప్రాణర
క్షణము సేసికొనుట గాదు నీకుఁ
బథ్య మనియుఁ దలఁమి పల్కితి విను విన
వేని నొచ్చి తలఁచె దిట్టు లగుట. 62

వ. అని యగ్గౌతముండు శోకాయత్తచిత్తుం డగుచుం దనకు హితోపదేశంబు సేసిన విని దుర్యోధనుండు వేఁడినిట్టూర్పు నిగిడించి యొక్కింతసేపు చింతాక్రాంతుండై యూరకుండి క్రాల్చినకనుదోయి విచ్చి యవ్వి
ప్రవరుమొగంబు సూచి యిట్లనియె. 63

చ. చెడుటకు నోర్వ కీ విటులు చెప్పితి నాకు హితంబు నెయ్య మె
క్కుడు గలయట్టిచుట్టమున కున్ నయశిక్షదగుం గదా భరం
పడి బవరంబులం బెనఁగుచుంగిని గార్యము దెల్పఁ జాలిన
ప్పుడు నిను రక్షణార్థి ఎని భూసురసత్తమ యే [illegible] 64

వ. నీకూర్మి పేర్మిఁజేసి కీడు దోఁగింపం జూచి సంధి కర్తవ్యం బని పలికితివి గాని యప్పలుకులు నాకు రుచియింప వెట్లంటేని. 65

సీ. కపటంపుజూదంబు ఘటియించి రాజ్యంబుగొని ధర్మజుని మదిగుందఁజేసి
సభ కేశపత్ర రజస్వల నమ్మెయిఁ బాంచాలి ముంద [illegible] పట్టి యీడ్చి
సంధి సేయఁగఁ బూని శౌరి యేతెంచిన నవ్విధంబున నప్రియం బొనర్చి
పలుపురుషహతి సౌభద్రు నొక్కని [illegible] గిట్టి యత్తెఱంగున నీ టడంచి

తే. నేఁడు దుశ్శాసనునితొమ్ము నెత్తురనిల
సుతుఁడు మదమునఁ ద్రావుట చూచి కొఱఁత
ప్రతినదేర్చునతండని భయముఁ బొంది
పొందుగోరిన నది యేల పొసఁగుఁజెపుమ. 66

ఉ. రాజులు భక్తిఁ గొల్వఁగ ధరావలయం బఖిలంబు దర్పవి
భ్రాజితవృత్తి నేలి యనురక్తులఁ బ్రోచుచు శత్రుకోటికి
న్దేజము దప్పఁ జేయుచు [1]నతిప్రమదంబున నున్న నాకు నిం
కాజియె కాక యొక్కనిదయం గనురాజ్యసుఖంబు లేటికిన్. 67

వ. నిశ్చయం బిట్టిద యగుటంజేసి. 68

ఆ. పొడుతు నెట్లు పాండుపుత్రులతోఁ గయ్య
మేను నీవు దీని కియ్యకొనుము
పలుకు వినమి గాఁగఁ దలఁపకు ముచితంబు
తెలఁగు దీరజనుల కెఱుఁగరాదె. 69

చ. విభవమునుం బ్రతాపమును విశ్రుతకీర్తియు మాయ ధర్మపు
త్ర భటసమానవృత్తమున దైన్యము నొందుట కోర్వ రాదు వీ
తభయతఁ బోరఁ బేర్కొని యుతాత్తపదంబున కేఁగి భీష్మకుం
భ భవజయద్రథాదులగుబంధుల మిత్రులఁ గూడు టొప్పగున్. 70

వ. అంత వలవ దిమ్మాట మగపాడి కాడితిం గాని. 71

ఆ. ఏను దెంపు చేసి యీయున్నరథిక జ
నంబుతోడఁ గడఁగి నడంగి నడవఁ బెట్టుఁ
దటమి పాండురాజతనయుల మర్దింతు
ననఘ నీవు మెచ్చునట్లు గాఁక. 72

చ. అన విని చుట్టు నున్న నృపు లందఱు సంతస మంది యన్నరేం
ద్రుని వినుతించి యోటమికి రోయుట నొందిన చింత వంత యె
ల్లను దిగంద్రోచి నెమ్మనములన్ రణకౌతుక మావహిల్లనా
ననములు దోఁప దర్పవచనంబుల నేనకు నుబ్బొనర్చుచున్. 73

1. ననింద్య పరాక్రమ లీల నున్న నాకాజియె.

—: దుర్యోధనుఁ శిబిరంబు విడిచి సరస్వతీ తీరంబు చేరుట :—

వ. చెలంగి కృపకృతవర్మాశ్వత్థామశకునిశల్యులు గార్యంబు విచారించి కౌరవేశ్వరు నాలోకించి మన మీ రాత్రి శిబిరంబున నిద్రించుట యొప్ప దెట్లనినఁ గర్ణుం దెగటార్చుటంజేసి పేర్చిన యుబ్బునఁ బాండవులు పైకొని పరాక్రమింప నప్పళింపఁ గలుగుఁ బో యని తలంచెదము వినుము వంచనఁ దొలంగియుండి మనకుం గలచతురంగంబుల నాయితంబు సేసికొని పెనఁకువం బన్ని వారికి వెఱంగగునట్టి బెట్టిదంపు టురవడిం గదిసి రణంబు సేయుద మట్లైన జయంబు గొనవచ్చునని చెప్పిన నవ్వసుమతీపతి ప్రీతుండై యది లెస్సవెర వట్ల చేయుద మని సముచితభంగిం దగువారల కెఱింగించి కదలి యచటికి రెండా మడ యగు సరస్వతిపొంతం బయలిక బలంబులం గొని చని సకలజనవాహన సహితంబుగా నమ్మహానదియం దిచ్ఛానురూపస్నానపానంబు లాచరించి వలయు తెఱంగున వెనుక నడతెంచిన వివిధాహారంబులం దుష్టిఁ బొంది యిష్టాలాపంబులు సెల్లుచుండ నున్న సమయంబున నన్నాకర్ణంబు నడపినదొరలును జిత్రసేనాదిభవ త్కుమారులును గర్ణుకొడుకు సత్యసేనుండును లోనైనయాప్తజనంబు లమ్మనుజనాథున కిట్లనిరి. 74

చ. వెరవును లావునుం గలిగి విక్రమసంపద సొంపు మీఱె భూ
వర భవదీయ మైన బలవర్గము నొడ్డన మేర్ప వీఁకమైఁ
బురికొలుంపగ నిర్భయతఁ బోలెడునట్లుగఁ దాను ముందరై
తిరముగఁ జేయఁ జాలు నొకధీరు నొనర్పుము సైన్యనాథుఁ గన్. 75

వ. అనిన విని వృషస్కంధుండును బీనదీర్ఘభుజార్గళుండును భర్గవర లబ్ధజన్ముండును దివ్యాస్త్రవేదియు నవ్యాహతవిక్రమోద్దాముండును నగు నశ్వత్థామ నాలోకించి యాదరభరితుండగుచు నాథరబీవరుం డతని కిట్లనియె 76

ఆ. అనఘ నీవు నాకు నాచార్యునట్టుల
నేడుగడయుఁ గాన హితము సెప్పఁ
దగు బలాధినాథుఁడుగఁ జేయు నర్హుని
నెల్ల వినఁగ నిశ్చయింప వలయు. 77

చ. అనుటయు నాతఁడిట్టు లను నజ్జనపాలున కాజినైపుణం
బును మహనీయశౌర్యమును భూరిబలంబును సర్వశస్త్రవే
దనముఁ బరాక్రమోద్ధతియు ధైర్యసమగ్రతయుం గలండు శ
ల్యుని రథినీపతిత్వమహిమోజ్జ్వలుఁ జేయుము కౌరవేశ్వరా. 78

క. నినుఁబట్టి పాండుపుత్రులఁ
దనమేనల్లురఁ దొరంగె ధరణీశ్వర యీ
తనిఁ గడచిన పరమహితులు
మనకుఁ గలరె యితఁడు లోకమాన్యుఁడు గాఁడే.

తే. కార్తికేయుం డధీశుఁడుగా నమర్త్య
లెలమిఁ బురికొని దైత్యుల గెలుచుకరణి
మద్రవిభుఁ దగ్రణిగ నేచి మనము నడచి
కడిఁదిపగఱ జయింతము కౌరవేంద్ర.

వ. అనిన విని సమస్తజగతీశులును జయజయశబ్దంబులతో శల్యుం బరి
వేష్టించి సంగరోత్సాహంబునం బొంగిరి కురునాథుండు గద్దియ డిగి
సవినయంబున నమ్మద్రవిభున కభిముఖుండై యిట్లనియె. 81

ఉ. పొచ్చెము లేని నెయ్యమునఁ బూని విపద్దశ నొంద కుండఁగా
నెచ్చెలిఁ గావఁ జూచుమహనీయున కిట్టిద కాల మిప్పు డీ
వచ్చుపడంగ నీభుజబలాతిశయంబున నద్భుతంపు గె
ల్పిచ్చి కృతార్థుఁ జేయు నను నే నిసుఁ జెందియుఁ దూలఁ బోదునే. 82

క. పూనుము చమూపతిత్వము
నానమ్మినవారు నేను నరపతిబలసం
తానంబుతోడఁ బిఱిఁదన
మై నడచెద మాక్రమింపు మరివర్గంబున్. 83

చ. అన విని శల్యుఁ డిట్లనియె నమ్మనుజేంద్రున కిప్పుడింత ప్రా
ర్థన మొనరింపనేల వసుధావర యే నినుఁ జేరినప్డ నా
ధనమును బ్రాణమున్ బలవితానము నీకు సమర్పణంబు సే
సినయవి గావి నీపనుపు సేసెదఁ గౌరవసేనఁ గాచెదన్. 84

మ. భుజవీర్యంబున నచ్యుతార్జునులు నన్ బోలంగలే రక్క ద
చ్చి జయింపంగఁ గడంగినన్ సురలు నాచే నొత్తురే నేచి య
క్కజపుంజేవయు లావు జూపువడికిం గౌంతేయు లే యోర్తు రా
ప్రజయున్ నీప్రజయుం దలంగఁ జెంగఁ బాటింతు నాటోపమున్. 85

చ. అటిముటి బాణజాలముల నక్కడిసైనికులం దెరల్చెదన్
గుఱికొని నాకు మాఱుకొని కోల్తలఁ జేసినవీరవర్గమున్
నఱికెదఁ జూచుఖేచరగణంబుల కచ్చెరుపా టొనర్చెదన్
బఱపెదఁ బాండునందనులఁ బాఱక నిల్చిన రూపడంచెదన్ 86

శా. గంగానందనుపోటు మెచ్చక గురుం గాదంచు రాధాతనూ
జుం గీడాడుచు నీతఁ డెవ్వఁ డొకొ యంచున్ శల్యుఁడే యిట్టివా
నిం గయ్యంబుల మున్ను గాన మనుచు న్వైభంగులం జూప తె
ల్లం గీర్తింప ధనుఃకళానిపుణలీలాఖేలతన్ జూపెదన్. 87

——: దుర్యోధనుఁడు శల్యుని సేనానాయకుంగాఁ జేయుట: ——

వ. అని పలికిన నీసుతుండు ప్రీతుండై కనకకలశంబుల సరస్వతీజలంబులు దెప్పించి శాస్త్రోక్తప్రకారంబునం దగురాజులుం దాను సేనామధ్యంబున భద్రవిధానోపేతంబుగా నమ్మద్రవిభు నభిషేకించి బలాధిపత్యపట్టబంధంబు నిర్వర్తించిన శంఖ భేరీప్రముఖ మంగళతూర్యరవంబులు సెలంగ సైనికసింహనాదంబు లుల్లసిల్ల నప్పు డాశల్యు నుద్దేశించి దీవనలం బొగడ్తల నఖిలజనంబులును ముఖరు లయి రిట్లుసంతసిల్లి సపరివారంబుగాఁ గురుభూమీశ్వరుండు విశ్రామంబు నొందె నట్టియెడ మున్ను సమరజయంబునం బ్రమోదభరితుం డగుచు నిజశిబిరంబునకుం జనిన పాండవాగ్రజుండు బంధుమిత్రపరివారసహితుండై దమ[illegible] బోవం బనుపక యుచితప్రదేశంబునం బేరోలగం బుండి మనవారివలనివిశేషంబు లరయఁ జారులం బనిచినవాఁడై వారలు మగిడివచ్చునంతకు నే మేని వినోదంబులం బ్రొద్దు వుచ్చి యక్కడియుత్సాహంబు తెఱం గంతయు విని యచ్యుతునాననం బాలోకించి యిట్లనియె 88

చ. కురుపతి మద్రరాజుఁ దనకుఁ బలముఖ్యునిఁగా నొనర్చి సం
గరమున కుత్సహించె నధికప్రమదంబున వారిసేనయుం
దిర మయి పేర్చి యున్న యది దీనికి నెయ్యది సేయువార మీ
వరయుము కార్యవృత్తి హృదయంబునఁ బాండవరక్షణోత్సుకా. 89

వ. నీ వెట్లు నిశ్చయించి పలికె దట్ల చేయుదు ననిన నమ్మహీకాంతునకు
మురాంతకుం డిట్లనియె. 90

సీ. శల్యు నెఱుంగుదు శౌర్యధైర్యంబు లగ్గల మాతనికి బాహుబలఘనుండు
గాంగేయకుంభజ కర్ణుల మిగిలెడుఁ గాదేని సముఁ డగుఁ గాని యసదు
గాఁ దలంపఁగరాదు కౌరవపతి మాన్యుఁ జేయుట నధికవిజృంభణంబుఁ
జూపు భీమునకు నర్జునునకు నెనయంగ రాదు సాత్యకి కోర్వరాదు పార్ష

తే. తునకుఁ దత్సోదరులను మార్కొని పెనంగి
బ్రదుకరాదు నీవీట నాబల్లిదునకు
నెదురరథికునిఁ గాన ననేక హేతి
నిపుణశార్దూలవిక్రమ నీవు దక్క. 91

క. ఒరు లయినఁ బెక్కు దినములఁ
బొరిగొను నీబలము నెల్లఁ బొరివోవ నతం
డరిభంజన నీవైనం
బరమోత్సాహమున నెల్లి పడ వైతతనిన్. 92

ఆ. అతఁడు మేనమామ యను కృప దక్కుము
రాజధర్మమును బురస్కరించి
యతులవిక్రమక్రియాపాటవంబున
నవ్విరోధిఁ జామ మడఁప వలయు. 93

క. గాంగేయుని గుంభజుఁ గ
ర్ణుం గడచితి మింక నుద్ధురుం డగుమద్రే
శుం గూల్పు మంతతోడఁ దె
గుం గురుపతిపని జయంబు గొనుము కడంకన్. 94

వ. అనిన విని యుధిష్ఠిరుం డతని కిట్లనియె. 95

ఆ. అనఘ నీవు చెప్పినట్టులు సేసెద
మున్ను పలికినాఁడ నన్నరేంద్రు
కడిమి నాకుఁ జాలు గాఁ బూని యుద్యోగ
వేళయందు నెల్ల వినుచు నుండ. 96

వ. సదనంబునకుం జని సుఖనిద్ర సేయు మని పలికి పద్మనాభునిఁ దన తమ్ములను ధృష్టద్యుమ్న శిఖండిసాత్యకి ప్రముఖులను దక్కటి పరిజనంబులను నిజమందిరంబులకుం బోవం బనిచి వీతశల్యంబైన మాతంగంబుచందంబున శయ్యాతలంబు సేరె బలంబంతయు నత్యంత సంతుష్టంబై విశ్రాంతి నొందె నారాత్రియే నిట వచ్చి నీకుఁ గర్ణ వృత్తాంతంబు సెప్పి నీవు వనుప మగిడి చని తెలతెల వేగునప్పుడు కౌరవ సేనాసన్నివేశంబు సేరితి నాసమయంబున. 97

క. కురుపతి పడవాళ్లం దగు
దొరలకడకు సత్వరముగ దురమునకు భటో
త్కరము ననువు సేయుటకై
బరవసము దలిర్పఁ బనిచెఁ బార్థివముఖ్యా. 98

వ. పనిచిన నెల్లవారు నుల్లంబుల నుత్సాహంబు లుల్లసిల్లఁ దమతమచతురంగంబులకు సపరణలు సంఘటింపం దొడంగినఁ దూర్యంబులు సెలంగ నొండొరులఁ బిలుచునెలుంగులు నింగిముట్ట రథనేమి గజపదతురంగఖుర పుటభటచరణ సంఘట్టితం బగు ధరచేతలం బ్రదుప బహుళం బగు నలివు చంద్రోదయసమయమూర్ఛమానం బగు మహార్ణవంబునినదంబు నను కరించె నట్లాయితంబై శల్యశకునికృతవర్మాశ్వత్థామలును దక్కనుం గల యోధవరులును నొక్కెడ ననుజ సహితుండై యున్న మనుజపతి సన్నిధిఁగూడి యతండు వినఁ దమలో నిట్లనిరి. 99

క. ఒకఁ డొకఁడ పాండవులఁ దాఁ
కక సైన్యోపేతగాఢగతి నందఱు నొ
క్కొకతల గాఁ దలపడి వా
రికడంక యుడుపఁగవలయుఁ గ్రీడయ పోలెన్. 100

చ. కడఁకయు లావునుం గరఁగి గట్టిగఁ గూర్చి యొనర్చినట్టిపే
రొడళులఁ దాల్మియుం గడిమియుం గలయం బరికించి యందు నే
ర్పిడుకొని గాథభంగి రచియించినచందము నెమ్మనంబులం
గడుఁ జెలువొంద నుబ్బి వడిఁ గాల్బల మేఁగెఁ గరం బుదగ్రతన్. 105

వ. ఇట్లు కురుబలంబు సమరతలంబు చేరంబోవు నంతం బాండవబలంబును
జనుదెంచె ననిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె. 106

తే. సురనదీసుతు చావును గురుని చావుఁ
గర్ణుచావును వినిన నాకర్ణములకు
శల్యుచావు దుర్యోధనుచావుఁ జెప్పి
యధికతరముగ సంతోష మాపహింపు 107

క. అమ్మద్రవిభుని ధర్మజుఁ
డెమ్మెయిఁ బరిమార్చెఁ గౌరవేంద్రుని భీముం
డెమ్మెయిఁ గీటడఁచె రణం
బెమ్మెయిఁ బరిపాటిఁ జెల్లె నేర్పడఁ జెపుమా. 108

వ. అనుటయు సంజయుం డమ్మనుజపతి కిట్లను వగచుకొలంది కడచనియె
ధీరుండవై వార్త లవధరింపుము 109

క. గంగాసుత గురుకర్ణుల
సంగరమునఁ బాండుసుతులు సంపుట గన్నా
రం గనియు నీతనయు లా
సం గూరిరి వారిఁ జంపు శల్యుం డనుచున్. 110

వ. దుర్యోధనుండు దిక్కుమాలి యుండియు నడియాసం జేసి తన్ను
సంపన్నునింగాఁ దలంచుచు. 111

చ. అనుజులుఁ దాను శల్యునిఁ బ్రియాతిశయంబునఁ జేరఁ బోవ నా
యన మును కర్ణుఁ దర్జునశరాహతిఁ గూలిన నుబ్బి భీముఁ డా
ర్చిన నడ లొంది తల్లడిలు చిత్తము లూఱటనొంద వారలం
గనుఁగొని పల్కె ఁ శ్రుతిసుఖం బొనరించె నుదగ్రమూర్తియై, 112

వ. ఇట్లు సమరోత్సాహ సమగ్రుండయిన మద్రపతి సర్వతోభద్రవ్యూహంబు
వన్నించె నందు ముఖంబున మద్రపతి గర్ణపుత్రప్రముఖపరివృతుండై

తాను నిలిచె వలపట శకయవన సమేతుండై కృపాచార్యుండును దాఁపటఁ త్రిగర్తసహితుండై కృతవర్మయు వెనుకఁ గాంభోజసహాయుండై యశ్వత్థామయు నడుమఁ గురువీర పరిరక్షితుండయి కౌరవేశ్వరుండును నతనిముందటఁ గరిఘటాగ్రభాగవర్తియై బహుళచతురంగంబులతోడ శకునియు నిలుచునట్లుగా నొనర్చి పేర్చి యురవణించె నంతకమున్న పాండవులు మూఁడు మొగంబులుగా మోహరించిరి ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకు లగ్రేసరులుగా భీమార్జును లగ్రజు నగ్రభాగంబున శోభిల్లి సీతారూపవిద్యోతితంబైన శల్యుకేతనంబు సూచి త్రోచి నడచి రనిన విని ధృతరాష్ట్రుం డప్పటికి మనకుఁ బాండవులకుం గల సేనాంగంబులకొలంది యెఱింగింపు మనవుడు సంజయుండా జనపతి కిట్లను మనకుఁ బదునొకండువేలు రథంబులును బదివేలు నేడు నూఱు గజంబులును రెండులక్షలుహయంబులును మూఁడు కోట్లు పదాతులును వారికి నాలువేలు రథంబులును మూఁడువే లేనుంగులును లక్షగుఱ్ఱంబులును గోటి కాల్బలంబులును గలిగియుండె నయ్యోధ్ధనంబు లోఁడొంటి గెలుచు నగ్గలిక దగ్గఱియె నట్టియెడ. 113

ఉ. ఒండొరులన్ జయించుమతి నుద్భటలీలలఁ జాల నొప్పి య
ప్పాండవకౌరవుల్ పెనఁగుభంగిఁ గనుంగొనువేడ్క నొక్క యా
తఁడు మహాద్రి నెక్కె ననఁ దద్దయుఁ జె న్నగుబింబకాంతి న
ర్కుం డభిరాముఁడై పొడుపుగొండపయిన్ వెలుఁగొందెఁ జూడఁగన్. 114

చ. అరసి యనాగతం బెఱుఁగునట్టి మనంబులు గల్గుపాండుభూ
వరసుతబంధుమిత్రకురువర్గసుహృజ్జనకోటు లత్తఱిం
బొరసె నతిప్రమోదమును భూరివిషాదము నాఁగ నంబుజో
త్కరము వికాస మయ్యెఁ గుముదంబులు మీలన మొందె నెంతయున్. 115

సీ కుంజరనికురుంబకుంభస్థలీసంగసిందూరరుచులతోఁ జెలిమి చేసి
కేతనవ్రాతసంకీలితమాణిక్యరశ్మలగెడ విహారంబు సలిపి
సైనికనికరవక్షస్స్థలపరిలిప్తకాశ్మీర దీప్తులఁ గౌఁగిలించి
దండనాథోత్కరచండభావోద్వృత్తచక్షుఃప్రభలుఁ దారు సరస మాడి

తే. యంశుజాలంబు లుభయసైన్యంబులందుఁ
బరఁగి బహువిధశస్త్రాస్త్రకిరణతతుల
బెరసి ప్రాగ్భాగలక్ష్మి దీపించి మెఱయ
బాల్యరమణీయుఁడగు చిత్రభానుఁ డొప్పె. 116

—: *కురుపాండవుల పదునెనిమిదవనాఁటియుద్ధ ప్రారంభము* :—

వ. ఇట్లు పూర్వసంధ్యాసమయంబునఁ దార్కొని భేరీప్రముఖతూర్యనిస్వ
నంబులు నింగి వ్రొంగం జెలంగ. 117

క. ఒండొంటిఁ దాఁకి హేతులు
మండఁగఁ దచ్చూర్ణతతులు మహిరాలఁగ ను
ద్దండతఁ గలయం బెరసెను
రెండు మొనలుఁ గ్రూరతరపరిస్ఫురణము లై. 118

వ. ఇత్తెఱంగునఁ దలపడి. 119

క. అరదంబులు నరదంబులఁ
గరులు గరుల హయము హయముఁ గాల్వురు మఱి గా
ల్వురఁ దాఁకి పెనఁగెఁ
గడుభీకరభంగులు మెచ్చుదేర గగనచరులకున్. 120

చ. పెనుపును నాకసం బవియుబృంహితముల్ దమ నుగ్రగర్జిత
స్వనములతోడిమేఘములచందము గా నొనరింప మీఁదియో
ధనికర మేయుసాయకవితానము భీషణవృష్టి గా రయం
బునఁ బయికొన్న యేనుఁగులపోరునఁ దేరులు దేలె నెత్తుటన్. 121

తే. కరులగమి వాపవి రథములఁ గాలుకొనఁగ
నీక మరలిన ఘోటకానీకములను
బిరుసుమగల మొత్తములను బిండిపీఁచు
సేయుచు లితంపునేర్పు లచ్చెరువుఁ బెనుప. 122

క. పటురయమున నాశ్వికులో
క్కటఁ బెక్కం డ్రెక్కి రథనికరములు [illegible]

త్రుటితాకృతులుగ విహరిం
చుట యెక్కుడు వేడ్క సేయ సురగణమునకున్.

క. పలువుర నొక్కఁడు నొక్కనిఁ
బలువురుఁ దెగటార్చుటయును బలుదెఱఁగులమూఁ
కలు పలుదెఱఁగుల దలఁపడి
బొలియించుట పొలియుటయును బొరినుగ్రముగన్.

క. చలమునఁ బోక పెనఁగుకా
ల్బలముపయిం దురగమును నిభంబులు నరదం
బులఁ గూడి కవిసి యింతిం
తలు దునియలు సేఁత యనుచితక్రౌర్యముగాన్.

క. తెల్లనిసపరణ మెఱయ స
ముల్లసితము లగు తురంగములమొత్తము చం
చల్లలితపక్షములు శో
భిల్లుగతుల నొప్పునంచపిండుం బోలన్.

వ. అయ్యిరువాఁగును బేరు వాడునప్పుడు.

క. గుణనినదము రణనేమి
క్వణనంబుం దురగఖురరవముఁ గరిఘంటా
రణనమును హేతిసంఘ
ర్షణనాదముఁ దూర్యఘోషసంపదఁ గడచెన్.

సీ. నెత్తుటఁ దోఁగియు నిగిడి పోరెడువీరు లలరిన నడ మోదుగుల
గ్రక్కునఁ దెగిపడి కదలెడుబాహుదండములు మహాభుజంగమ
యవని రక్తాక్తంబులై యున్న యట్టిబల్ దలలు గెందామర
దఱచుగా నెఱి దప్ప నొఱగినగజములు గులిశభగ్నాచలకుల

తే. దునిసి తొఱఁగినజోదులతొడలు సామ
జములకరములు నొండొంటిచందములు గ
నుఁగొనఁగ వింత లగుటను సంగరాంగ
ణంబు రమణీయమును భీషణంబు లయ్యె.

తే. ఏమి చెప్పుదు రౌద్రంపుటెసకమందుఁ
దఱచుమెదళులు దొంపులు నుఱుము లైన
యెమ్ము లిసుకయు సితచామరమ్ము లంచ
లయ్యె రుధిరంపు టేఱుల కప్పు దళప. 130

క. విను మయ్యేఱులలో వా
హనములె యోడలుగఁ జూడ నక్కజ మగు ను
క్కున నుద్దామవిహారం
బొనరించిరి వీరయోధు లుర్వీనాథా. 131

వ. ఇవ్విధంబునం బోరు ఘోరంబై చెల్లుచుండ నుల్లసిత విక్రమ విజృంభితు
లగుభీమపార్థులు నలిరేఁగి నారాచప్రముఖనానావిశిఖంబుల మనమొనఁ
గనుపు గొట్టిన నది బెగడొంది మగిడిన నమ్మేలెపఁగ బొబ్బి పౌండ్ర
దేవదత్తంబుల నొత్తుటయు ధృష్టద్యుమ్నుండును శిఖండియుఁ గొంతే
యాగ్రజు మున్నిడికొని తమ్ముఁ దోడన కవలను గడఁగి రట్లాటో
పదీపితులైన పాండవేయుల యురవడికి నోటుపె నీబలంబు హాహాకారం
బులతోఁ బలుదెసలఁ బఱవం దొడంగినం గనుఁగొని శల్యుండు సారథి
కిట్లనియె. 132

ఉ. అల్లదె కంటె పాండుతనయాగ్రణితేరు సితాశ్వయుక్త మై
తెల్లనిమెల్లి నొప్పెనది తీవ్రత మార్కొని యాన్నృపాలుతో
భిల్లుట మాన్పఁగా వలయు భీషణభంగి రథంబు వోవ ని
మ్మెల్లజనంబు నాకఁమి యేర్పడ నేఁ దెలుఁగంగఁ జేసెదన్. 133

ఆ. సురలనైన గెలుతు దురమున విను నాకుఁ
బాండుపుత్రు లెదురె భండనమున
నేర్పుఁబలుపుఁ జూపి నిన్ను మెప్పింతు నా
చేతిబరువు సూడు సూతవర్య. 134

వ. అనుటయు వాఁడు పాండవబలంబుల కెదురుగా నరదంబు సముచిత
రయంబున నడప నమ్మద్రపతి సముద్రసముద్రేకంబుచండం బైన యా
సైన్యంబు సవసవ్వంబు చెలియలికట్టయుం బోలె యుడుపుటఁ యచ్చెరు
వై యుండె నట్లు పార్థుధైర్యంబున నున్నసిన్నుకల్యాం జూచి మనమూఁ

కలును మగుట నిగిడిన సంగ్రామంబు భీమం బయ్యె నందు నకులుండును గర్ణపుత్రుండగు చిత్రసేనుండును దలపడి యొండొరువులకుఁ గృతాస్త్రత్వంబును సమరవిశారదత్వంబును జూపుచుం బెనంగునెడ నాసూతపుత్రుండు. 135

కర్ణుకొడుకులు చిత్రసేన సత్యసేన సుశర్ములు నకులునిచేతఁ జచ్చుట

చ. నకులునిచాపదండము ఘనప్రదరంబునఁ దున్మి భాస్వరాం
బకములు మూఁడు దీవ్రగతి ఫాలతలంబున నాటి త్రుంచెఘో
టకములఁ గేతనం బిలఁ బడఁ దివిదళించి వధించె సూతు ఖే
టకమును ఖడ్గముం గొని కడంగఁ బయిం బరఁగించె భల్లముల్. 136

క. అనిశితభల్లములు దన
మేనికి రాకుండఁ బలుక మెఱయ జడియుచున్
వే నిగిడి కదిసె మాద్రీ
సూనుం డాసూతసూతిసూనునరదమున్. 137

తే. కదిసి మీఁదికి లంఘించు మద మెలర్ప
గళము దునిమిన నమ్మస్తకంబు డొల్లెఁ
గర్ణపూరకిరీటసంకలితవివిధ
రత్నరోచులు మెఱయ ధరాతలమున. 138

వ. ఇట్లు చిత్రసేనుండు వడినం గనుంగొని కౌంతేయసైనికు లార్చినం బేర్చిన శోక రోషంబులు మనంబునం ముప్పిరి గొన వానిసోదరులు సత్యసేనుండును సుశర్ముండును నప్పాండుపుత్రుపైఁ గవిసిన నతండు వేఱొక్కతేరెక్కి విల్లెత్తి దండధరప్రచండమూర్తియై మూర్కొనిన నబ్బిరుదుమగ లయ్యరదంబు భల్లంబుల నటుకం గొడంగిన నుఱక చిఱునవ్వు నవ్వి. 139

చ. కడువడి సత్యసేనుతురగంబులఁ గూల్చి శరాసనంబుఁ జ
క్కడిచిన నొండుతేరికి రయంబుమెయిం జని యన్యచాప మె
క్కిడుటయు నక్కుమారునిరతేషుగణంబున నొంచి నొంచెఁ గ
వ్వడియనుజమ్ముఁ దుర్గుఁ దము వానిసహోదరు రెండుతూపులన్. 140

తే. ఆతనికను వాసుశర్ము( డుద్ధతి దలిర్ప(
ద్రుంచుటయు నొండువింట బల్దూపు (లొడల
బఱపి వానిశిరంబును నఱకి సత్య
సేను విల్లు ద్రుంచె నాపాండుసూను( డధిప. 141

శా. ఆరాధేయతనూజు( డన్యధను వుగ్రాకారు( డై యెత్తి దు
ర్వారప్రక్రియ నేసె నావిశిఖముల్ వారించి యాతం డతి
క్రూరస్ఫారశరత్రయం బతనివక్షోభిత్తి( గీలించి వే
నారాచంబులు రెండు దమ్మునిమెయిన్ నాటెం గడున్ బెట్టు(గన్. 142

క. వా రలిగి యొక్కయుమ్మడి
సారథి( దెగటార్చి మార్చి చాపము దునియం
దేరు వికలముగ మేను వి
దారితముగ నేసి రప్యుదగ్రస్ఫురణన్. 143

వ. ఇవ్విధంబున 144

మ. విరథుండున్ విసికృత్తచాపు(డు శరావిద్ధుండునై మేదినీ
వర నీపుత్రు(డు చంచదుగ్రతరజిహ్వాం బైన చండాహి నా(
గర మాభీలత( బొల్చుశక్తి( గొని యల్కన్ సత్వరుం డయ్యె సు
స్థిరసంరంభత సత్యసేను( బడవైచెం జూప అగ్గింప(గన్. 145

ఆ. అన్నపాటు సూచి యనుజు( డుల్లంఘన
నడలు కనలు( గదుర సంపవాక(
గప్పె నకులు నంత( గాంచి భీముకుమారు(
డెయిదె నతని యరదమెక్కె నత(డు. 146

వ. ఇట్లు ద్రౌపదేయుంచగు శ్రుతసోముని యరదం బెక్కి బలువిల్లు గొని యక్కుమారుండును దోడుపడ నాసుశర్మని బటుశరపరంపరలం బొదివిన( బొలివోక యతండు. 147

తే. వా(డితూపులు నఱుఁమై మూ(డు నా(టి
యిరువదింట( దత్పుత్తునియురము నొంప
నర్ధచంద్ర బాణాహతి నవ్విరోధి
శిరము దునిమె నప్పాండుభూవరసుతుండు. 148

శా. మాద్రీపుత్రునిచేతఁ గర్ణసుతు లీమాడ్కిం బడం జూచి వీ
రోద్రేకం బెడలంగ నీసుతుబలం బొక్కుమ్మడిన్ విచ్చిన
న్మద్రాధీశుఁడు సింహనాదము రణన్మౌర్వీసముల్లాసమున్
రౌద్రప్రక్రమ సూచకంబులుగ సంరంభస్ఫురన్మూర్తియై. 149

తే. హస్తతల మెత్తి నిలునిలు మని యదల్పఁ
బోక తిరిగి యమ్మూఁకలు పోరి కమరెఁ
బాండవేయుల మొనలు నుద్దండవృత్తి
నురువణించినఁ సంగర ముగ్రమయ్యె. 150

చ. అదరి ధనంజయాదులగు నక్కడివీరులు విక్రమింప ని
క్కడ భవదీయనందనముఖప్రభవోద్భటయోధవర్గము
ల్వడిఁ దఱుమంగ నప్పుడు బలద్వయమున్ విశిఖాగ్ని పేర్చి యె
క్కుడయినభీతి నొందె రణఘోరత భూవర యేమి సెప్పుదున్. 151

వ. ఇట్లు మథితం బయ్యును పౌరుషంబు పెంపున నిరువాఁగును వేగంబు గుందక [illegible] పెర్చుక్రందు గగనచరులకుఁ గన్నులపండువుగా బృంహితధ్వనులను ఘంటానినదంబులను నేమినిస్వనంబులను గేతుకింకిణీక్వణనంబులను రింఖారవంబులను హేషాఘోషంబులను భుజాస్ఫాలనంబులను సింహనాదంబులను దిక్తటభేదనం బొనర్ప నద్భుతోత్సాహంబున నాహవక్రీడ సలుపుచుండఁ బుండరీకాక్ష రక్షితులగు పాండుపుత్రుల బలశౌర్యసంపదల సొంపునం బెంపొందవు ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకి ప్రముఖులైన దండిమగలు గూడికొని తఱుమ దారుణనైపుణంబున బాహాటోపంబు సూపినఁ గార్చిచ్చు గవిసినం గలంగు మృగకదంబుకైవడిం గౌరవసైన్యంబు దైన్యంబు నొందిన. 152

క. పెనురొంపిలోపలను బ్రుం
గినధేనువు నెత్తుపోలికిని శల్యుం డ
మ్మొనఁ దనభుజబలమునఁ గలఁ
గనియట్టుగ నిలిపె శౌర్యగర్వంబు మెఱయన్. 153

వ. నిలిపి పేర్చినసమయంబున వనదిక్కున నుల్కాపాతప్రముఖంబులగు దుర్నిమిత్తంబులు పొడమిన నీ కొడుకులు గూడుకొని చేయుంగల సైని

కులం గూర్చికొని తిరంబయి పెనంగి రట్లు పెనంగునెడఁ గడంగి తల
కడచి మిగిలి మద్రపతిమార్గణాసారంబు వరఁగించుచుఁ బాండవాగ్రజు
నగ్రభాగంబున నున్న భీమసేనసాత్యకిధృష్టద్యుమ్నశిఖండిద్రౌపదేయ
మాద్రేయులఁ దాఁకి పరస్పరప్రదరంబులు నొప్పించి కదిసి యన్నరపతికిని
బదితూపుల వేఁడిమి సూపి మలసినఁ బాంచాలప్రభద్రకబలంబు లాజెట్టి
బిరుదుచుట్టు ముట్టిన. 154

ఉ. వాలి యతండు బాహువిభవం బలరించినఁ బేర్చి రౌద్రతం
గూలుగజంబులుం గెడయుగుఱ్ఱపుతండముఁ ద్రెళ్ళుతేరులుం
గీ లెడలించినట్ల పడుకేతువితానము నుగ్గునూచ మై
రాలుపదాతివర్గములు రక్తపుటేఱులుఁ బ్రేవుప్రోవులున్. 155

వ. మఱియును. 156

క. ఏరూపు లయిన రూపణ
ఘోరాశనులట్ల శల్యుక్రూరాస్త్రంబుల్
కౌరవులు పొంగఁ బాండుకు
మారుల సేనపయిఁ దొరఁగె మనుజాధీశా. 157

వ. అట్లు దొరఁగుచున్నమార్గణాసారంబున వెగడుపడి యోధులెల్లం బాండ
వాగ్రజువెనుక కొదిఁగిన నమ్మహీపతిఁ బురికొల్పికొని శల్యు మార్కొని
నిశితవిశిఖవర్షంబునం బొదివిన నమ్మద్రవిభుండు ఘోరనారాచం బతని
మేనుచ్చిపోనేయ నా ధర్మనందనునకుఁ దలకడచి యేకమ్ముల నవ్వాడ
ముడియు సహదేవుం డనుదుడుప్పుడు నకులుండు [illegible] బున
బ్రతివింధ్యాది ద్రౌపదేయులు బాహుబాణపరంపరలను నప్పుడు నేయ
నప్పుడు కృపాచార్యుండును కృతవర్మయు శకునియు దత్సుతుం డులూ
కుండును నీ కొడుకులుం గవిసిరి సుపుత్రుండు మందహాసంబుతో
నమందగతి వచ్చి వారిఁ గూడుకొనియె నక్కడి సైనికులును రథసంబున
నా రథికవరులఁ దాఁకి రట్టడిమెన. 158

క. కృపుఁడును ధృష్టద్యుమ్నుఁడు
నుపమాతీతాతిఘోరయుద్ధంబున బా

హంపట్టుతమ్ములు సూపి ర
థిప యొండొరులకు సమత్వదీప్తాకృతు లై. 159

క. ఒకని నొకనిఁ బదిపదిసా
యకముల నొప్పించె వీరు లగు పాండుకుమా
రకు లేవుర నంతట ద్రో
ణకుమారుఁడు మోము చిఱుతనగవున నొప్పన్. 160

ఆ. వాయువేగము చిత్రపర్ణాశ్వముల మద్ర
పతి ధరిత్రిఁ గూల్చె నాఁడు దేరు
డిగ్గి నిజగదాపటిష్ఠతఁ జూపెఁ గౌ
రవ్యసైన్యమునకు రాజముఖ్య. 161

క. అనిలజునియశ్వములఁ గూ
ల్చినయప్పుడు శల్యునిం గలితనము మెఱయం
దనయంపవెల్లిచే ముం
చె నకులుతమ్ముఁడు నీదుసేన దలంకన్. 162

తే. అతనిహయములు నమ్మద్రపతిశరములఁ
బడిన నప్పాండవునిఁ దలకడచి బలము
పొదివె నయ్యోధముఖ్యుఁ దత్పుత్రుఁ డపుడు
గదిసె నాసహదేవుపైఁ గడిమి మెఱయ. 163

చ. కవిసిన దట్టకెం పసరుకన్నులతోడఁ గృపాణపాణియై
యవనికి దాఁటి యాతనిశరావలి ద్రుంచుచుఁ గిట్టి తేరిపై
కి వడిఁ జలంబుమై నరిగి కేశియపోలె శిరంబు ద్రుంచి పో
యె వెసఁ బొగడ్త కెక్కి ధరణీశ్వర యొండురథంబుమీఁదికిన్. 164

వ. ఇవ్విధంబున. 165

క. సుతుఁ డీల్గిన మద్రమహా
పతి శోకా క్రోధవేగభరితాత్మకుఁ డై
శితశరపరంపరం ను
ద్ధతిఁ బాండవసైనికులమదం బడఁగించెన్. 166

—శల్యభీమసేనుల గదాయుద్ధము—

క. ఉరవడి రథికజనంబులఁ
దెరలిచి యేపారుతనదుతేరు మెఱయ ను
ద్ధురగతిఁ గౌంతేయాగ్రజు
నరదమునకుఁ గవిసి వాలురమ్ములు నిగుడన్. 167

సీ. కనుఁగొని భీముండు గన్నుల నిప్పులు రాలఁ గండాలకీలాలరంజి
తంబును రిపుసైన్యదైన్య ప్రదంబును నాత్మీయవాహినీహర్షకరము
నై శతధారామహాభుజగక్షమాధరశృంగసమత నుదగ్ర మగుచు
నెనిమిదియంచుల నెసఁగుమెఱుంగుల దారుణం బగుగదాదండ ముగ్ర

తే. రేఖ సారించి రౌద్ర ముద్రేక మందఁ
గదిసి మద్రాధిపునితురంగములఁ జదియ
మోఁదె నాతండు దోమరమునఁ దదీయ
విపులవక్షంబు భేదించె నృపవరేణ్య.

క. ఉరమున నాటినఘనతో
మరమును డాచేతఁ బెఱికి మారుతి మద్రే
శ్వరుసూతు వైచె దానన
ధరణిని బోరగిలఁబడ నుదగ్రస్ఫురణన్. 169

మ. విరథుం డై పొలివోని దర్పమున నవ్వీరుండు ఘోరంపుము
ద్గరముం గేల నమర్చి తేరు డిగి దుర్దాంతాకృతిన్ వజ్రభా
సురశక్రుండును దండచండయముఁడున్ శూలోగ్రపాలాక్షుఁడున్
సరి సేయం దగువారు గాఁగఁ బొలిచెన్ సంస్తుత్యసంరంభతన్. 170

వ. ఇట్లవష్టంభవిజృంభితుం డైనయాసేనాధిపతిం జూచి యేచి భీముఁ
డుద్దామ రభసంబున నతనికి సమ్ముఖంబు గా నడరినఁ బణవాదివాదిత్ర
నిర్భరనినదంబులు సెలంగె నప్పు డయ్యిరువాఁగు నిరువుర నేనికపోరు
చూచువిధంబునఁ గనుఁ గొనుచు గదారణంబునకు శల్యుండు దక్క
మారుతి మార్కొనఁ జాలుమేటి మగలు నివ్విధముడి వెలి గా నెమ్మద

పతిమీఁదఁ గవియనట్టిజెట్టిబిరుదులుం గలరే యనుచు వచ్చెరు వొందు
చుండ. 171

ఆ. మండల ప్రచారమహితాకృతులు గర్జ
నలుగఁ బొలిచి మాఱుమలసి యంకె
లెసఁగఁ బోరి కమరి యే పారువృషభయు
గంబునట్లు వారు గవిసి రధిప. 172

చ. మదమున నిమ్మెయిం గదిసి మద్రవిభుండును భీమసేనుఁడుఁ
గదలమెఱుంగు లాకసము గ్రమ్మఁగ నుద్భటభంగిఁ ద్రిప్పి బె
ట్టిదముగ వ్రేయ నిప్పులు వడిం దొరఁగించె సమగ్రవిస్మయ
ప్రదరవభంగు లై యవి పరస్పరఘోరవిఘట్టనంబునన్. 173

వ. ఇట్లు దొడంగి.

క. ధిక్కారంబులు చరణద
ళక్కారంబులును మెఱయ బలువు వెరవు పే
రుక్కును నెక్కుడు వేగము
నక్కజములు గా సుకీర్తులై పోరునెడన్. 175

చ. వెరవున నంగపుల్ నుసుల వ్రేటులు వమ్ముగఁ దాఁకినప్డు ది
క్కరిరదనప్రహారములఁ గంపము నొందక యుండుమేదినీ
ధరములఁ బోల్పఁ బట్టగునుదగ్రపుమూర్తుల కిద్ద ఱందు ని
ష్ఠురరభసంబు శౌర్యము పటుత్వముఁ ద్రాసునఁ బెట్టిన ట్లగున్. 176

వ. ఒక్కొక్కమాఱు ఱువ్వున. 177

క. ఎనిమిదియడుగులకొలఁదని
వెనువెనుకకుఁ బోయి నిగిడి వేగంబునఁ గి
ట్టిన యెడఁదగరుల వడిఁ దాఁ
కునగంబులభంగి దోఁచుఁ గురుకులముఖ్యా. 178

వ. ఇత్తెఱంగునఁ బెనంగి నెత్తుట జొత్తిల్లినయంగంబులు పుష్పితకింశుకంబులఁ
బోలఁ బరిశ్రమంబు నొందియుఁ బొలివోవనిదర్పంబున. 179

—గదాయుద్ధమున మూర్ఛితుడైన శల్యుని గృపుఁడు తొలంగం గొనిపోవుట—

క. ఇరువురును సందు సూడక
వెర వెడలినయాగ్రహముల వ్రేసినగద లొం
డొరులమెడలకెలకుల బ
ల్వరములు దాఁకుటయు వారిలం బడి రధిపా. 180

వ. ఇవ్విధంబున నమ్మహావీరులు మూర్ఛిల్లుటయు నుభయసైన్యజనంబులును హాహాకారముఖరులై రట్టియెడఁ గృపాచార్యుండు శల్యుకడకుఁ దన రథంబు రయంబునం బఱపించి. 181

క. పడియును గద విడువనియ
క్కడిఁదిమగని గ్రుచ్చి యెత్తి గారవమున నం
దిడి తొలఁగం గొనిపోయెను
వడముడి దెప్పిఱియె నంత వసుధాధీశా. 182

వ. తెప్పిఱి లేచి చూచి సేన దేఱియమ్మద్రపతిం బేరుకొని యుద్దండగదాదండ మండితం బైనకరంబునం బిలిచె నయ్యెద్దతి సహింపఁజాలక సింహనాదంబుతోడఁ దూర్యస్వనంబులు సెలంగఁ గురుభూవరుముందర సైనికులు రథసంఘా నతఁడునుఁ గూడికొని తఱుమఁ గవిసినం గౌంతేయాగ్రజునగ్రభాగంబున రథికులు చేకితానపురస్సరులై యార్పులు నింగి ముట్ట నయ్యనిలతనయుఁ దలకడచి వారిం దలపడి పెనంగి రప్పుడు. 183

శా. ఆకౌరవ్యపిభుండు వజ్రకరినం బై యొప్పుప్రాసంబు దీ
ప్రాకారోజ్జ్వలవృత్తి నెత్తి నిజసైన్యం బుబ్బునం గ్రాలఁ గే
లికల్పంబుగ మింట జంటమెఱుఁగు ల్నిండం బ్రదీప్తక్రమ
శ్రీకాంతుం డగుచేకితానుఁ బడవైచెం జూప ఖగ్గింపఁగన్. 184

వ. ఇట్లు చేకితానుండు పీతాసుం డైనం గని కౌంతేయులు గోపాటోపంబున సైన్యోపేతగతిం గడంగి కౌరవసైన్యంబుపైఁ బటుబాణంబులు గురియుచు నడరిన శల్యుండు ధర్మపుత్రుని దుర్యోధనుండు ధృష్టద్యుమ్ను నమ్మహీపతి పనుప నశ్వత్థామత్రిగర్తులు మూఁడువేలరథ బులవారు వివ్వచ్చుని

మహోత్సాహంబున మార్కొనిరి తక్కటియోధులు సేనయు నవ్విరోధివరూధిని గఁయం బెరయుటయు నక్కజం బయ్యె నప్పుడు పెంధూళి యెగసి చూడ్కులు నిగుడ కున్నను సైనికుల సింహనాదంబులు సెలంగం జేయుటయు బిరుదులు ప్రకటించుటయు బోధకంబుగాఁ బోరిన బోరనఁ దొరఁగు శోణితం బారేణువు నడంచినఁ బ్రియం బంది యిరువాఁగును బ్రేయుండు పొడుపుం దనునెలుంగులు నింగి ముట్టఁ బెనంగు నట్టియెడ. 185

చ. బరవస మొప్ప మద్రపతి పాండవముఖ్యునిమీఁదఁ గాండముల్
గురిసిన నాన్నపాలుఁడు నకుంరితుఁడై పదునాల్గుతూపు ల
న్నరపతిమేనఁ గ్రుచ్చి యెలనవ్వున నొప్పిన నమ్మహీశుపే
రురమున నాఱు నారధికుఁ దొక్క సముజ్జ్వలబాణ మేద్రైఅన్. 186

వ. నాటినం గనలి యమ్మనుజేంద్రుండు చంద్రసేనుండను తదీయచక్ర రక్షకుం దునిమి నవనారాచంబులు సారథిమేన నిగిడించె. 187

ఆ. అప్పుడు శినివరుండు సుపుత్రుఁడు, జేది
బలము శల్యుఁ దీవ్రభంగిఁ బొదువ
నాతఁ డాధనంజయాగ్రణిఁ బటుతర
పంచమార్గముల నొంచె నధిప. 188

క. విను మరుపడియేడమ్ముల
శినిమనుమని యు బ్బడంచెఁ జేదిరధికులం
దునిమెం దీవ్రశరోత్కర
మున నిరుపదియేవురఁజ సముద్భటభంగిన్. 189

క. కవలు తనమీఁద రయమునఁ
గవిసిన నిశితతరసాయకములను మౌర్వీ
రవము నెలంగఁగ వారల
యవయవముల నినిచె నతఁ డహంకృతి మెఱయుచున్. 190

చ. కనుఁగొని ధర్మసూతి భుజగర్వ మెలర్పఁగ బెట్టు గిట్టి శ
ల్యునిమెయిఁ దీవ్రమార్గణసముత్కరముం బరఁగించి కేతువుం
దునిమిన నాఁ డాపతికిఁ దూపులవేఁడిమి సూపి వాయుసూ
నునిఁ గవలఁజ శినిప్రవరు నొంచె పడిం బదియేసి యమ్ములన్. 191

ఉ నొంచి మదించి ఖేచర మనోహరుఁ డై వడి ధర్మపుత్రు ద్రు
క్కించి మహోగ్ర బాణపరికీలితదేహునిఁ జేసె దానఁ గో
పించి శితాస్త్రముల్ గవలు భీముఁడు సాత్యకియుం గడంక గు
ప్పించిన వానిఁ ద్రుంచి శరపీడితదేహులఁ జేసె వారలన్. 192

వ. చేసి యోఁడొాకభాసితధ్వజం బెత్తించి మెఱసిన 193

సీ. భీముఁ డాతనిమెయి బెడిదంపునారసం బడరించి వెండియు నట్టి వేడు
పఱపె సాత్యకి శతబాణంబు లతనిపై బెట్టేసె మాద్రితొాల్పట్టి యైదు
తీవ్రాస్త్రముల సహదేవుండు పదునాలు గమ్ముల నవ్వీరునంగకములఁ
బరఁగించి రమ్మద్రపతి భీమసేనాదు లైనయన్నలువుర నతిరయమున

తే. వరుస డెబ్బదిమూఁటను నిరువదేను
వాఁడితూపుల నేనింట మూఁడుమార్గ
ణములఁ బీడితులుగఁ జేసి నఱకె భల్ల
నిహతి సహదేవుచాపంబు నృపవరేణ్య. 194

శా. ఆమాద్రీసుతుఁ డన్యచాపధరుఁ డై యత్యుగ్ర బాణంబులన్
మామా యెక్కడఁ బోయె దంచు వెస నమ్మద్రేశు నేయంగ ను
ద్దామోదగ్రత భీమసాత్యకులు శాతప్రస్ఫురన్మార్గణ
స్తోమంబుల్ గురియంగ ధర్మసుతుఁడుం దూపుల్ మెయిం గ్రువ్వఁగన్. 195

చ కలయఁగ నెత్తురుల్ దొరఁగ గైరికవిర్ఝరజాలరంజితా
చలమును బోలి పొల్పెసఁగి శల్యుఁడు వారల నస్త్రపంచకం
బుల వెస నొంచి త్రుంచెఁ గురుభూవర ధర్మజుచాప మప్పుడా
బలమును శౌర్యమున్ సురలు ప్రస్తుతి సేయ మహోగ్రమూర్తియై 196

ఉ. వేఱొాకచాప మెత్తి పృథివీపర ధర్మతనూజుఁ డింతతోఁ
దీఱఁగఁ జేయుదుం బగ యతిప్రకటంబుగ నంచు సూతుమైఁ
దూఱఁ దురంగమాంగములు దూఁటులు వోవఁగ శల్యునెమ్ములన్
గీఱ సిడంబు గాఁడఁ బరఁగించె సముజ్జ్వలచండకాండముల్. 197

వ. ఇవ్విధంబున విజృంభించిన. 198

క. కోపించి యతఁడు దర్పా
టోప ముదగ్రముగ దశపట్టుప్రవరము లా
భూపాలుమేనఁ జొనిపిన
భూపాలక యాతఁ డొల్లఁబోవుటయు వెసన్. 199

-: ధర్మరాజు శల్యుని బాణంబులచేత మూర్ఛితుం డగుట :-

క. శైనేయుఁ డదరి యుజ్జ్వల
నానావిశిఖముల మద్రసరపతిఁ బొదువం
దా నలిగి విల్లు దునియలు
గా నొకభల్లమున నేసె గర్వోద్ధతుఁ డై. 200

క. ఆరథికవరుని నకులుని
మారుతి సహదేవు మూఁడుమార్గణముల నే
పారఁగ బలుపారఁగ రయ
మారఁగ నొప్పించె నమ్మహాభుజుఁ డధిపా. 201

వ. అంతం దెలిసి యక్కౌంతేయాగ్రజుండు మద్రపతి ముద్గరంబున నేయ నివ్విరోధిపై సాత్యకి దోమరంబున వృకోదరుండు భల్లంబును నకులుండు శక్తియు సహదేవుండు గదయును బ్రయోగించిన నయ్యోధవరుండు వాని నన్నింటిని మింట మెఱుంగు లడరువెడఁదమ్ములు వరఁగించి త్రుంచి యార్చినం బేర్చినరోషంబున నాకృష్ణానుజుండు సారథి మూఁడువాఁడి తూపుల నవ్విరోధి రెండుబాణంబుల బెట్టేసినఁ గ్రోధదీప్తుండై ప్రచండ కాండంబుల నయ్యేవురను గ్రుక్కించిన నీపుత్త్రుం డతనిచేతఁ బాండు పుత్రులు పొలియుదు రని యెంచె నట్లు భాసమానుం డైన సేనాపతిం గని భీమసేనుండు సహింపక తెంపున బెట్టు గిట్టిన. 202

క. శినిమనుమఁడు గవలను దో
డన యురవడి నదరి పొదువుటయు నగ్గలికం
బెనఁగె నతం డానలువుర
కనలుఁ గడంకయును నరకు గాఁ గొన కధిపా. 203

వ. ఇట్లు పెనంగుచుండఁ బాండవాగ్రజుండు మున్ను దనచేతఁ జచ్చినచంద్ర సేనుతోడివాని ద్రుమత్సేనుఁ దల ద్రెవ్వ నేసినఁ జక్రరక్షకహీనుం

దయ్యును బొలివోనికనలున శల్యుండు సటలు వెఱికినం గోపించుసింగం బుచందంబై సమీరణసుతాదులగు జోదులనలువురయంగంబులం దురంగనికరశరీరసారథినికాయసహితంబుగా బహువిధ విశిఖంబులు వరంగించి నెత్తురులు దొరంగించినం గని యాధర్మనందనుండు విషాదంబు నొంది నిజాంతర్గతంబున. 204

క. హరివచనంబు లసత్యతం
బొరయంగ నేర్చు నొకొ మద్ర భూపతిబాహు
స్ఫురణము భీమాదిరధిక
వరు లోర్వని యట్లు గాంగ వ్రాలెడిం దోర్త్రోన్. 205

వ. అని తలపోసి తనబలమునకుం జేయి వీచినం దోయధివీచివితానవిలాసంబు చందంబునం జతురంగంబులు శల్యునిపైం గవిసిన నాధైర్యధౌరేయుండు మందరనగంబులీలం గైకొని వారలం గలంచి పాంచాలపుత్రప్రభృతి యోధప్రకరంబులను బాండవాగ్రజునిం బరమసాంద్రతీవ్రశరాంధకారంబునం గప్పి సింహనాదంబు చేసిన. 206

క. దివిజగరుడఖచరాదులు
వివిధవచనరచన లెసంగ వినుతించిరి శా
త్రవభీకరుం డగునమ్మ
ద్రవిభునిరణవిహరణములు ధరణీనాథా. 207

వ. ఆసమయంబున. 208

తే. గురుసుతుండు పెనుబ్రాపుగా నరునింబొదివి
యధిపసంశప్తకులువివిధాస్త్రతతులం
గప్పి రతం డందఱను జండకాండవిదళి
తాంగులుగంజేసె దోర్లీల యతిశయిల్లు. 209

చ. తెరలక వారు పై పయి నుదీర్ణసముద్ధతిం గ్రమ్మి వాజులన్
హరిని సిడంబుపైం గదియ నాతండు నేద్పడ బాణవర్షముం
గురిసిరి కౌరవేంద్రుమొనకుం బ్రమదం బగు ఘోరభంగి న
ప్పురుషపరాక్రమస్ఫురణ పార్థివసత్తమ కాన మెయ్యెడన్. 210

వ. కట్టి సవ్యసాచికిం జేయార్వ రాకుండ దర్పంబు సూపిన నాభూవర కుమారవర్యుండు పీరాగ్రహావేశంబున విజృంభించి భల్లార్ధచంద్రక్షురి కాముఖనారాచప్రముఖవిశిఖపరంపరలు వరంగింప నవి యాసైనికుల కర్ణంబులం గూల్చియుం గేతనంబులు ద్రుంచియుం బాణంబులు నఱకియు బాణాసనంబులు విఱిచియు సూతుల గీటడంచియు సదనంబులం జెక్కియు హైమకవచంబులు వ్రోస్ల సేసియుం జామరంబులు దునిమియు నాతపత్రం బులు రూపుమాపియు నెత్తురు లురిలించియుం గండలు దొరింగించియు నెమ్ములు వగిలించియుం గాళ్లు ద్రుంచియుం జేతులు దునిమియు ద్రవ్వ్యు లుగా పతంబులు సీఱియు మర్మంబులం జొచ్చియు మకుటంబులు దర్చియుం దలలు రాల్చియుం బ్రాణంబులు పీల్చియు రౌద్రం బావహిం చిన లయకాలరుద్రుని సంక్రీడనంబుచందంబు దోంచె నప్పుడు రథికవరస హస్రత్రయంబు దెగటారె నవ్వాండిమగండు పేరడవి దహించుదావ పావకుచందంబున వెలింగెం దదీయతేజోమహిమ సహింపక యుద్ధామ గతి నశ్వత్థామ గడిసి యక్కవ్వడిం దొడరి దురంబొనర్చె నందు. 211

సీ. అతండు పంద్రెడువాలమ్ము లాబీభత్సుమెయిం గ్రుచ్చి కృష్ణునిమేనియందుం బది వాండిపాపులు వఱపిన మదలోన నగ్గించి యప్వీరుం డలంతిరగపు లోడ రథ్యముల సూతునిం గూల్చి యాతనితనువున నెఱతెగగొనక నాటె మూండుమార్గణములుముసలంబుపరిఘంబునాతండునిగిడింపనవియు నదియు

తే. నశ్వరుండు దోడుతోడ నైదాఱునిశిత కాండములం ద్రుంచి పటుసాయకత్రయంబు నొనిపె నప్పార్థు మేన మూర్ఛానియె నపుడు గదంగి యప్పార్థు సంశప్తక వ్రజంబు 212

వ. ఇత్తెఱంగున. 213

-: సురథుండను పాంచాలకుమారుం డశ్వత్థామచేం జచ్చుట :-

క. సురథుండు గురుసుతుపైం దన యరదము పఱపించి యేయ నప్పాంచాలో త్తము నొకనారసమునకును సెరి సేసె నశండు గినుక యెసకం బెసంగన్. 214

వ. ఇత్తెఱంగున. 215

ఆ. సురథుఁ గూల్చి యతనియరదంబుపైకి ను
ద్ధురత నరిగి గురుసుతుండు చండ
కాండసమితి నిగుడ గాండివిఁ దాఁకి సం
శప్తకులకు సంతసం బొనర్చె. 216

వ. అయ్యవసరంబున. 217

క. కురుపతి ధృష్టద్యుమ్నుని
యురవడి గద నిలువరించి యుద్ధతి మెఱయన్
శరపంచకమున నొంచెను
బరఁగించెను మఱియు నవతిబాణము లొడలన్. 218

తే. అతఁడు దెబ్బవెయమ్ముల నతని నొంప
నన్నరేంద్రుండుఁ జేడ్పడ ననుజసమితి
బలయుతంబుగ నడరి యబ్బలియుమీఁదఁ
గురిసె రస్త్ర శస్త్రంబులు నరవరేణ్య. 219

క. ఆ పాంచాలోత్తముఁ డు
ద్దీపితకోపుఁ డయి వారిఁ దీవ్రతరశరా
టోపంబునఁ గలఁచె రయం
బేపారఁగ నాత్మ సేన తేఁటెఱ మెఱయన్. 220

చ. కృపకృతవర్మలం గడిమిఁ గిట్టి శిఖండి ప్రభద్రకుల్ మహో
గ్రపువడి దోర్పడంగ భుజగర్వము సూపిన నాబలాఢ్యులుం
గుపితమనస్కులై బలుపుఁగోల్తలఁ బేర్చినలావు చేవ క
య్యపువెర వేపు దాల్మి సరి నచ్చెరుపాటున ముంచెఁ జూపఱన్. 221

వ. అప్పుడు శల్యుండు యుధిష్ఠిరభీమసేననకులసహదేవసాత్యకిప్రముఖులపైఁ
బటు బాణంబులు గుప్పించి నొప్పించిన. 222

క. నకులుఁడు రథసంబున సా
యకవశక మతనియురంబునందుఁ జొనుప స
భ్రుకుటి యగుచు నయ్యల్లునిఁ
ద్రికాండముల నొంచి యతఁడు దీపించె నృపా. 223

క. తక్కటినలువురు వాదివిన
నొక్కొకనిశరీరమున మహోగ్రాస్త్రంబుల్
పెక్కులు వెసఁ బఱపి మదం
బెక్క నకులుధనువు దునిమె నిషుసహితముగన్. 224

వ. ఇట్లు శల్యుండు విజృంభించినఁ గోపించి. 225

మ. నకులుం డొండొకచాప మెత్తి పటుబాణశ్రేణిఁ బర్వింపఁ గీ
చకవిధ్వంసి నిగిడ్చె షష్టిశరముల్ శైనేయుఁ డుద్దీప్తసా
యకముల్ దొమ్మిది యేయ ధర్మసుతుఁ డీరైదమ్ము లమ్మద్రనా
యకుపై నన్నియుఁ బిన్నతమ్ముఁడును దోడై నాట నాటెం గడున్. 226

తే. అతఁడు వెస నవసప్తతి శితశిలీము
ఖముల సాత్యకి నొంచి మార్గణముతోడ
ధనువు ద్రుంచి రథ్యమ్ములధరణిఁ గూల్చి
పదిపదుల్ బలుఁదూపులు వఱపె మేన. 227

క. ఇవ్విధమున శినివీరుని
క్రొవ్వు చెఱచి పాండుపుత్రకులబాణంబుల్
నివ్వటిలనీక నలువుర
నవ్వీరుఁడు నొవ్వ నేసె నద్భుతభంగిన్. 228

ఉ. పాండవు లట్లు మద్రపతి బాణములం దెరలంగఁ జూచి తా
నొండొకతేరికిం జని సమున్నతి సాత్యకి దాఁకె నాతనిం
జండతరప్రచారణవిశారదుఁ డై వెస వారు గూడి యు
ద్దండత సూపి ఠక్కఱపుదర్ప మెలర్పఁ బెనంగె నాతఁడున్. 229

ఉ. ఏవురతోడ నట్లొకఁడ యేచి పెనంగుటఁ గౌరవేంద్ర యో
ధావళి చూచి కూడికొని యారథికోత్తముగాథవిక్రమ
ప్రావిలసిల్లి నంప పెనుఁజీఁకటి యాకస మెల్లఁ గప్పఁగాఁ
జేవయు లావుఁ జూపుటయుఁ జెద్పడి రాప్రతివీరు లందఱున్. 230

వ. సేనయు నొక్కుమ్మడి నద్దిక్కు దఱిమినం గని కృష్ణార్జునులు నిజ
సైన్యంబు సమస్తంబు నేకముఖంబు సేసి మార్కొని రాసమయంబునఁ

గిరీటి కృపకృతవర్మలను సహదేవుండు సౌబలుని ద్రౌపదేయులు గొందఱురాజులను శిఖండి యశ్వత్థామను భీమసేనుండు సుయోధనునిఁ దాఁకఁ బాండవాగ్రజుండు దనకు నకులుండు బాసటగా శల్యు నిలువరించెఁ దక్కుంగల యోధులుం దక్కటి సైనికులుం దలపడి క్రమంబున నెల్లబలంబులును గలయం బెరసె నిట్లు నూల్కొని యంత కంతకు రణంబు సమ్మర్దదారుణం బయ్యె నత్తఱి నమ్మద్రపతి రౌద్రంబు రూపు దాల్చిన తెఱంగునం బొంగి పాంచాల యాదవాది రథికవరులకును బాండుకుమారులకును వారింపఁ గొలఁది గాక రథచిత్రగతుల మెఱయ నెక్కడఁ జూచినం దానయై నానావిధవిశిఖవితానంబుల నంబరభాగంబు సంవిహితంబుసేసిన మధ్యందినగతం బయ్యును మార్తాండబింబంబు దోఁపకయుండె నట్టియెడ. 231

సీ. కరులఁ ద్రుంచెడువేళ గిరులఁ దున్మాడుసం
క్రందనుకైవడిఁ గానవచ్చు
నరదముల్ దెరలించునప్పుడు పఱమొగుల్
విరియించుబలుగాడ్పువిధము మెఱయు
హయములఁ జెండాడ నరుగుచోట్లను లేళ్ల
గమిఁ గిట్టుకోల్పులికరణి యొలయు
భటులకు నరుగుచోఁ బసలేని పెనుఁ గాన
దరికొనుచిచ్చు చందంబు గలుగుఁ

తే. గసి మసంగినయంతకుకరణి యంత్య
కాలరుద్రునిదర్ప మకాండమృత్యు
ముఖము నుగ్రభావము దోఁచుమొనయు వీర
సమితిఁ దెగటార్చునప్పు డాశల్యునందు. 232

వ. ఇట్లు విజృంభించి యత్యద్భుత విక్రమంబున నుల్లసిల్లునమ్మద్రమహీపతి నుభయసైన్యంబుల జనంబులు ప్రశంసించి రంత కంతకు నగ్గలం బగు నగ్గలికఁ జెలంగి యఱిఁడు భల్లాదికాండపరంపరలు పటురయంబునఁ బరఁగించుపరమాధిల భంగికి నోహటించి ధర్మజుమోహరంబు దెరలి పఱవం దొడంగిన నన్నరవరుం డవల్చి కరతలం బెత్తి నిలునిలు మని

నివారింప నిలువదయ్యె నయ్యుధిష్ఠిరుండు పౌరుషంబు పెంపునఁ దెంపు
సేసి మామా యని పేరెలుంగెత్తి యా శల్యునిఁ దాకి దర్పంబు
సూపినం జూచి మగుడ నిగిడి సేన పోరికిం బురికొనియె నప్పుడు
పాండవాగ్రజుండు దమ్ములను దొరలను దనపాలికిఁ బిలువం బంచి
వారలతో నిట్లనియె. 233

చ. అమరనదీసుతాదులగు నక్కడివీరుల మీర నందఱుం
గ్రమమునఁ బిల్కుమార్చి భుజగర్వము సూపితి రేను శత్రుసై
న్యమథనకల్యు శల్యుఁ దెగటార్చెద నాకిది కృత్య మీసము
ద్యమ మనివార్యమై నెగడునట్టి తెఱంగు వినుండు చెప్పెదన్. 234

వ. నాతేరికి నకులుఁడును సాత్యకియు వలపటను సహదేవుండును ధృష్టద్యు
మ్నుఁడును డాపటను గావలియై రావలయు వెనుకం గదిసి వివ్వచ్చుం
డును ముందటి కెలన మొనసి పడముడియును నడచునది యింత యేమిటి
కనవలదు నన్నొండె నతం డతని నొండె నేను సమయించుట యవశ్యం
బును గలుగంజూచితి నిట్లు తెంపుసేసి యమ్మద్రపతి మార్కొనునాకు
దుర్గమప్రయత్నంబు కర్తవ్యంబు కృపకృతవర్మాశ్వత్థామసౌబలసుయోధను
లయ్యోధముఖ్యు రక్షింపం జేయుపరాక్రమంబునకు మీరు ప్రతివిక్రమం
బాచరించుచుండ నుదీర్ణంబగు మదీయబాహుపాటవంబున నమ్మేటిమగని
గీటడఁగించువాఁడనని పలికిన నా రథికవరులును దక్కునుగలవారు
లమ్మానవపతిపూనికి నగ్గించి యతనిరథంబు సవిశేషకల్పితంబు సేసి
యతండు సెప్పినతెఱంగున సన్నద్ధులై సముద్ధతిం దేజరిల్లుటయుఁ
దత్సైన్యం బుత్సాహదీప్తంబై కడంగినఁ గరిఘంటారావంబులును రథ
నేమినిస్వనంబులును దురంగకింకిణీక్వణనంబులును సుభటసింహనాదంబు
లును నిస్సాణాదితూర్యనినదంబులును బెరసి యంబరంబు పిక్కటిల్లఁ
జేసె నివ్విధంబున యుధిష్ఠిరుం డుద్యుక్తుండై యురవడించిన. 235

—: శల్య ధర్మనందనుల ద్వంద్వయుద్ధము :—

క. కురువిభుఁడు దనదు మొనఁకు
నురవడ మొప్పంగ మద్రపతి మును శౌర్యో
ద్ధురుఁ డయి కడఁగ నడరి య
వ్వరూథినిం దాఁకె ధరణి వడవడ వడఁకన్. 236

వ. అట్టియెడ. 237

క. **పు**లులు దలపడిన యుబ్బుపు
జలుపును దోఁపంగ మద్రపతిధర్మసుతుల్
తలపడి యొండొరువులపై
నలఘుప్రదరములు వఱపి రధికరయమునన్. 238

వ. వారి నాలోకించి యుభయసైన్యంబులు విజృంభించి సంరంభంబునం
గలయం బెరసినఁ గ్రందుకయ్యంబయ్యె నందు 239

ఉ. నీతనయుండు సింహకమనీయతరంబగు భీమునుల్లస
త్కేతన మర్ధచంద్రశరతీవ్రహతిన్ [illegible]
దాతిశయంబుతోడఁ బడునట్లుగ నేసి శరాసనంబు బల్
వాతిశరంబునం దునిమె వారివరూథిని యేపడంగఁగన్. 240

చ. అతఁడు ప్రదీప్తకోపముఖుఁడై పటుశక్తి నురంబు వై చినం
బతి యరదంబుపైఁ బడియె బల్వగుమూర్ఛ మునింగి యప్పు డా
యత ధనువెత్తి సూతుతల యక్కురుఘస్మరుఁ డేసె డొల్ల వే
గ తొలఁగ నీడ్చెఁ దేరు దురగంబులు మూఁక గలంగి సొంపఱన్. 241

క. కని యశ్వత్థామయుఁ గృపుఁ
డును గృతవర్మయును నెక్కుడుబరవసమునన్
మనసేనకుఁ [illegible]
మనుజేశ్వర కవిసెఁ గ్రీడి మద మెలరారన్. 242

క. అమ్ముఖమున సమరము రౌ
ద్రమ్ముగ పెరిగె మద్రవిభునిఁ బలకడచి యనీ
కమ్ము బహులాస్త్రశస్త్రచ
యమ్ముల ధర్మజునిఁ బొదివె నత్యుగ్రముగన్. 243

వ. పొదివిన నయ్యుధిష్ఠిరుండు. 244

చ. అరదము చిత్రసంచరణ మక్కజమై వెలసిల్లఁ దేరులుం
గరులును ఘోటకంబులును గాల్బలముం దనచేతఁ గూలఁగాఁ
బొరలఁగ మేదినిం దనియ ప్రోవులు గా రుధిరంపురొంపి గ్రుం
గ రణవిహారముం జలిపెఁ గౌరవనాథ యనేకభంగులన్. 245

క. నరులు మృదు వితఁ దనంగాఁ
బరఁగుయుధిష్ఠిరుఁడు శత్రుబలముల కతిని
ష్ఠురుఁ డయ్యె నపుడు సుర ల
చ్చెరువందిరి చూచి ద్రోణశిక్షఁ బొగడుచున్. 246

క. మునుము బయలైన నలిఁ బే
ర్చిన యమ్మనుజేంద్రుమీఁద శితవిశిఖము లే
పున నిగిడించుచు శల్యుఁడు
దనరు భుజాబలముతోడఁ దఱిమెం బెలుచన్. 247

క. అవ్వీరునివాలంపఱ
క్రొవ్వునడఁచి తనదు నంపకోల లదరఁగా
నవ్వసుధాధిపుఁ డల్లని
నవ్వొలయఁగ మాఱుకొనె ఘృణారహితుండై. 248

వ. ఇవ్విధంబున మార్కొని ధర్మజమద్రపతులు నిజశంఖంబులు పూరించిరి భేరీప్రముఖతూర్యస్వనంబులు నింగి వొంగారఁ జెలఁగె నయ్యిరువురు నొండొరువులపైఁ జండకాండపరంపరలు పరఁగించి తనువుల నెత్తురు లురిలించి పూచిన బూరుగులపోలుపు దాల్చి రట్టియెడఁ గనుంగొను జనంబులు. 249

చ. వెరవును లావుఁ జేవయును వీరల కారయ నొక్కరూప దు
స్తర భుజశక్తి ధర్మజుఁడు శల్యుని రూపడఁగించి యివ్వసుం
ధర గొను నొక్కొ నేఁ డితనిఁ దా సమయించి సమస్తమేదినీ
శ్వరుఁడుగఁ జేయనోపు నొకొ శల్యుఁడు కౌరవరాజనందనున్. 250

వ. అని సందేహడోలాయమానమానసులై రప్పుడు. 251

తే. మద్రపతి ధర్మజునివిల్లు రౌద్ర మెసఁగఁ
ద్రుంచి సూటమ్ము లేసి యుద్ధురతఁ బేర్చె
నతఁడు వేఱొక్క ధను వెత్తి యతని ధనువుఁ
దునిమి వెస నేసె మున్నూఱు తూపు లలప. 252

*విరథుండయిన శల్యుని నశ్వత్థామ దనరథముపై నిడుకొని పోవుట*

ఉ. తోడనె తేరివాహములఁ ద్రుంచి మదంబున సూతుప్రాణముల్
క్రీడయపోలెఁ బుచ్చికొని కేతువుఁ గూల్చిన సేన విచ్చెఁ జే
యాడక యున్న శల్యుని రయంబున నాత్మరథస్థుఁజేసి పె
న్గీడునఁ బొందకుండఁ దొలఁగించెను ద్రోణసుతుండు భూవరా. 253

వ. ఇట్లు శల్యుండు సమరవైకల్యంబు నొందుటయు ధర్మనందనుం డార్చి పేర్చి తద్బలంబుఁ దఱిమె నంత నమ్మద్రపతి యొండురథంబు గల్పించుకొని కడంగి యాకౌంతేయాగ్రజుపైఁ గంకపత్త్రింబులు నిగిడించుచు నిగిడినం గని యద్దెసఁ జేయఁగల సైనికోత్తముల సరభసంబున నయ్యోధవరు నెదుర్కొని రప్పుడతండు సాత్యకిఁ బదిసాయకంబులను భీమసేననకులసహదేవుల శరత్రయంబులను గ్రుచ్చి యెక్కుడు మదంబునం బొదలినయంగంబులతో నలిరేఁగి మఱియు నప్పుడు పొగడం దగి యుండె నాకర్ణింపుము. 254

సీ. కమలాకరము లీలఁ గలచియాడెడుగంధదంతావళము సముద్దండతయును
దరమిడి మృగసముత్కరము ఘోరంబుగా వధియించుకంఠీరవంబు రేపు
నీరసారణ్యంబు నిర్భరాటోపతఁ గాల్చుదావాగ్నియుగ్రక్రమంబు
ప్రకటవిక్రాంతిఁ బురత్రయంబును సమయించుఫాలాక్షుని యేడ్తెఱయును

ఆ. బోల్పఁ బట్టు లయ్యె భుజగర్వశౌర్యప్ర
తాపదుర్దమప్రకోపములకు
మద్రవిభుఁడు గొలువనఁగి శాత్రవసైన్య
హననకేళి సలుపునవసరమున. 255

వ. ధర్మనందనుం దల మిగిలినచతురంగంబుల [illegible]ంబులు సేసి యమ్మహీపతిపైఁ గవిసినం గని కవలును శైనేయుండును భీమసేనుండును దోడ నడువ నతం డమ్మేటిమగని మార్కొని పటుమార్గణంబు లురంబున నించి నొంచె నప్పుడు కురువిభుండు వనుప మన సైనికులు దల మిగిలి శల్యునికిఁ బ్రాపయి యప్పవనతనయ ప్రభుతుల తోడఁ బెనఁగి రతం డాపాండవాగ్రజుమేనఁ బందకాండసప్తకంబు

నినిచిన నజ్జననాథుండు నవనిశితనారాచంబు లవ్వీరునంగంబుల నాటించె
నిట్లు దలపడి కోలుపులులపోలికఁ జేరేనుంగుల తెఱంగున బలుసింగంబుల
చందంబునం బోరి యొండొరుల నొప్పించి రప్పుడు 256

సీ. శల్యుండు బలునారసము పెండవాగ్రజునురమున నాట నత్యుగ్రదీప్త
ఘోరనారాచ మాకుంతీసుతుం డేయ నతఁడు మూర్ఛిల్లిన నలరె నధిపుఁ
డమ్మద్రపతి తేఱి యలుకఁ గెంపారెడుకనుఁగవతోఁ జండకాంత మొకట
నయ్యుధిష్ఠిరు నొంప నాతండు పసిఁడిమై మఱు వాఱుతూపుల నఱికివైచి

తే. వాలురమ్ములు దొమ్మిది వక్షమున ని
గుడ్ప నయ్యోధవరుఁ డతిక్రూరభల్ల
యుగళఖండితచాపుఁ జేయుడును నొండు
ధనువు గొని యవ్విభుండు దత్తనువు సించె. 257

క. బాసటయై భీముఁడు పె
ల్లేసెను మద్రపతి నాతఁ డిరువురతోడం
జేసెం గయ్యము గృపు ను
ద్భాసిత విక్రముతోడుపాటు గలుగఁగన్. 258

వ. అట్టియెడఁ గంకటాంతరంబు ధరియించి కడంగి. 259

ఆ. మద్రవిభుఁడు ధర్మమారుతసుతుల మై
మఱువు లక లునఱికి మార్గణములు
దొమ్మిదింట రెంటఁ దూఁటులు నేసె దో
ర్దండములు ప్రదీప్తవర్చుఁ డగుచు. 260

క. ఆలో ధర్మజుసారథిఁ
గూలఁగఁ గృపుఁ డేయ మద్రకుంజరుఁడు భుజా
లీల మెఱయంగ హయము
ల్నాలుగు నొకవ్రేల్మిడిని నిలం బడవైచెన్. 261

వ. ఇవ్విధంబున విరథుండై యమ్మహీకాంతుం డంతర్గతంబున. 262

క. గెలువుము శల్యుని నీ వని
పలికి ముకుందుండు నన్నుఁ బనిచినవాఁ డ

ప్పలుకులకు నసత్యత్వము
గలుగఁగ నేర్చు నొకొ దైవఘటనబలమునన్ 263

వ. అని శంకించియుఁ గొంకుపోవక యజ్జగన్నాథువచనంబునకు నన్యథాత్వం బెలగలుగు నని యద్దేవునిం దలంచి యామాట యమోఘంబు గావలయు నని ప్రార్థించి వెండియు. 264

చ. స్ఫురితషడర్ధనేత్రునిఁ ద్రిశూలసముజ్జ్వలు నిర్గుణుఁ గుణా
దరసముపాత్తమూర్తిఁ గలితప్రపంచస్థితిసంహృతిక్రియా
నిరతు నవర్తితత్రిభువనీమహనీయుని దైత్యమర్దిన
ప్పరుషవరుం జతుర్భుజు విభుం బ్రమహోన్నతు నాశ్రయించెదన్. 265

తే. ఖండనము సేయునరునగభాగమునఁ బ్ర
చండహాలోగ్రహస్తుఁడై శత్రుకోటి
గీటడంచుచు నేఁ జూడఁ గేలి సలుపు
దేవు జయసిద్ధికై సన్నుతింతు శక్తి. 266

వ. అనుచుఁ బురుషోత్తమునిఁ జిత్తమున నిలిపి యున్నతంబైన పూర్వ కాయంబుతో మంద్రప్రకారంబున మార్గణంబు లమ్మద్రపతిదెస నిగిడింప నతఁ డది బెండు వడుట గాఁ దలంచి తఱిమి యమ్ముటశరంబులు గురియుటయు నప్పుడు 267

చ. పవనసుతుండు విల్ నఱికి బాణయుగంబున మేను నొంచి శా
త్రవులు దలంక నారథికురథ్యముఁ ద్రుంచి ధరఁ గూల్చి సూతుకం
ఠపీఠశనం బొనర్చి ప్రకటస్ఫురణంబునఁ గంకటంబు భ
ల్లవితతి ఘోరసంహతి నిలం బడ నేసె రయుం బెలర్పఁగన్. 268

వ. ఇవ్విధంబున. 269

క. విరథుండు నచాపుఁడు ప
ర్మరహితగాత్రుండు నైన మద్రవిభుఁడు భా
సురఖడ్గచర్మశోభిత
కరుఁ డై తేరు డిగి కన్నుఁగవఁ గెంపారన్ 270

మ. జముచందంబున నేచి ధర్మసుతుపై సంరంభదుర్దాంత ద
ర్పమునన్ వే కవియంగఁ జండబలదుర్వారుండు భీముండు ద్రుం
చె మదం బారఁగ వాలునన్ బలకయున్ శీఘ్రత్వసందీప్తుఁ డై
తమది క్కార్పుబుఁ దూర్యనాదములు నత్యంతంబు శోభిల్లఁగన్. 271

వ. అమ్మద్రపతి నేర్పును జేవయుం గల పరిజనంబులు చేర్పఁ గంకటగదా దండఁబులు ధరియించి యుధిష్ఠిరుమీఁద నురవడి నడరు నప్పు డప్పాండవాగ్రజునకు బాసటయై సాత్యకి ధృష్టద్యుమ్న శిఖండిద్రౌపదేయ మాద్రేయు లేయు సాయకంబులు సరకుగొనక గదం జిత్రంబుగా జడియుచు వడముడివిక్రమంబునఁ దవులంబడక నిగిడె నశ్వసూత రహితంబగు రథంబుపై నున్న యన్నరేంద్రుండు తనదెసకు సింహచంక్రమణత్వసుందరుండై వచ్చు నవ్వీరు నాలోకించి సక్రోధంబైన యవష్టంభంబున నుద్దీపితుండై. 272

క. ఇతని సమయింప నయ్య
చ్యుతుఁడు నను బనిచె నాకు నొనరించినపా
లితఁ డని తలఁచి మొగ ము
గ్రత నొందఁగ శక్తిమీఁదఁ గనుదో యొలయన్. 273

వ. హృషీకేశు నుద్దేశించి. 274

ఉ. నీ దెస నాదుచిత్తమున నెక్కొని యుండెడుభక్తి భద్రసం
పాదిని గావు టచ్చెరువె భక్తజనాభిమతప్రదానవి
ద్యాదయితత్వ మేర్పడ జయం బొడఁగూర్పుము దేవ సంశ్రితాం
హోదళనంబు నీకు వ్రత ముల్లము నావయి నిల్పు మిత్రజిన్. 275

వ. అని హృదయ బునఁ బ్రార్థించి యప్పార్థివోత్తముండు. 276

ఉ. అచ్చపుభక్తిన్ మదిఁ బ్రియంబున నొందినపాలలోచనుం
డిచ్చినప్రీతియోగమును నెక్కుడుభక్తియు నావహిల్లఁగా
నిచ్చలు గంధపుష్పముల నిష్టమెయిం బరిశోభితార్చనం
బిచ్చుచుఁ దాను గొల్వ నతికెక్కిన యమ్మహనీయశక్తికిన్. 277

మ. ప్రణతుం డై రభసోదయాభినవదర్పస్ఫూర్తి [1]శోభిల్లుచు
న్మణిదండద్యుతిమంజరీస్ఫురణము న్సంశోభిఘంటాపటు
క్వణనంబుఁ రిపుసైనిక ప్రకరదృక్కర్ణవ్యథం జేయ భీ
షణరేఖం బగుదానిఁ బుచ్చుకొని చంచన్ముష్టిదృష్ట్యేద్ధతిన్. 278

వ. అభిరామభీమాకారుం డై. 279

తే. నెరయుకినుకఁ బెన్వెడఁద యై నిప్పు లురులు
కన్నుఁగవ శల్యుఁ జూచిన నున్న యునికి
నతఁడు నీఱు గాకుండుట యరిది యయ్యె
మాకుఁ జూడంగ నప్పుడు మనుజనాథ 280

వ. ఇట్లు రౌద్రోద్రేకంబునఁ బురత్రయదాహదోహలి యగు శూలాయుధులీల
దోఁప దుర్నిరీక్షుండై. 281

ఉ. ఘోరతరప్రకార మగుకుంచితబాహువిలాస మొప్ప వి
స్తారము వింత యౌనురము సారతరంబుగఁ జూచి వజ్రధా
రారుచిసన్నిభ ప్రచురరశ్ములు పర్వఁగ బిట్టు వైచె న
ద్దారుణశక్తి నవ్విభుఁ డుదాత్తసమిత్కృతికల్యశల్యునిన్. 282

తే. అట్లు పాండుభూపాలకు నగ్రసుతుఁడు
మద్రనాథుని వైచిన రౌద్ర మెసఁగ
గంకటముదూఱి వక్షంబు గడచివెన్ను
వెడలి చని యమ్మహాశక్తిపుడమిఁజొచ్చె. 283

*—: ధర్మరాజు శక్తి ప్రయోగించి శల్యునిం జంపుట :—*

వ. ఇట్లు శక్తి వెడిదంపుటురవడి నుచ్చిపోయిన. 284

చ. క్షతమున ముక్కునం జెవులఁ గన్నుల నోర్కెడురక్త మంగ మా
ప్లుతముగఁ జేయఁగా నతఁడు బోరగిలం బడియెఁ ధరం గద
ద్వితయము సాఁచి ధర్మజునిదిక్కు శిరంబుగ వజ్రదారుణా
హతిఁ బడు భూరిభూధరమహత్తరశృంగముభంగి భూవరా. 285

---

1. శోభిల్లుచు, న్మణిరత్నద్యుతిమంజరీస్ఫురణముల్.

ఆ. మహిమహీంద్ర నిట్లు మోహరింపం బడి
మద్రనాథుఁ డొప్పె మానవేంద్ర
క్షేమయుతముగందు లీలమై వ్రాలిన
ప్రాణనాథుఁ బోల్పఁ జట్టు గాఁగ. 286

ఆ. ధర్మసంగరమున ధర్మజుచేఁ జచ్చి
పొలిచెఁ జూడ మద్రభూమిభుండు
విధియుతంబు గాఁగ వేల్చి విడిచిన
హవి యున్న యగ్ని ననుకరించి. 287

మ. కని శల్యానుజుఁ డేచి ధర్మసుతు నుగ్రస్ఫూర్తి శోభిల్లఁ దాఁ
కిన నాథాపతి చిత్రచాపధరుఁడై కేళీసముప్రక్రియన్
ధనువుం గేతువుఁ ద్రుంచి తోడన సముద్యద్దీప్తభల్లాహతిం
దునిమెం గుండలకాంత మైనశిరము౯ దుర్దాంతదర్పంబునన్. 288

వ. ఇట్లు శల్యుండు సోదరసహితంబుగాఁ బడినఁ బాండవసైన్యంబు
జయంబున వృత్రవధం బొనరించు పాకశాసనుఁ బ్రశంసించు బృందారకు
లట్లు ధర్మనందను నగ్గించి రమ్మొగ్గరంబునం దూర్యనినదంబులు సింహ
నాదంబులుఁ జెలంగఁ గలంగి కురుసేన విఱిగి పఱచినం బోనీక
పొడువుం దనుచు సాత్యకి వెనుకొనుటయుఁ గనుంగొని కృతవర్మండు
మార్కొనియె నయ్యాదవసింహుల రణంబు దారుణంబయ్యె నందు. 289

సీ. కృతవర్మ సాత్యకి నతిశితశరదశకమున నొంచి తురంగములయుబ్బు
మడిపి విల్తునుము చేయుచు నొండువింటనబ్బలియుఁడాతనిమేనఁబదిమెఱుంగు
టమ్ములు నాటించి రథ్యమ్ములనరదంబు సూతుని నఱికెసఁ జూచి కృపుఁడు
దనతేరిపైఁ బెట్టుకొని తొలఁగించె నవ్వృషపోతకి మూఁక వెఱచి పఱచెఁ

తే. సడఁగి వెనుకొన్న పాండవోత్కరము నాక కిఁడ
నిలువరించె సన్నద్ధుఁడై సితనూజుఁ
డంత వేఁడాక్కతే రెక్కి యరుగుదెంచి
తాఁకె హార్దిక్యుఁ దరిసేన తల్లడిల్ల. 290

వ. ఇట్లెదిర్చి పేర్చినయతనికఁ బాండవాగ్రజుండు గృతవర్మని ఘోటకంబు లను గీటడంగించినఁ గురునందనుం డాహార్దికనందనుని నిజస్యంద నంబున నిడుకొని యవ్వలికిం గొనిపోయె నప్పుడు కృపాచార్యుండు గదిసిన నయ్యుధిష్ఠిరుం డాఱమ్ము లెమ్ములం గీలింప నతండు పదాఱు తూపుల నాభూపాలుఁ దదీయతురంగంబుల నేసె నాసమయంబున. 291

తే. భద్రకరి నెక్కి చామరప్రకరవీజ
నములు ధవళాతపత్రవిభ్రమసమృద్ధి
యతిశయిల్ల సైన్యోత్సాహ మావహిల్లఁ
బొలిచె నెంతయు భద్రనీయపుత్రుఁ డధిప. 292

శల్యుచుట్టంబు లొక్క పెట్ట ధర్మరాజుం జుట్టు ముట్టుట

ఉ. అమ్మనుజేంద్రుసుందటికి నార్పులతోఁ జనుదెంచి శల్యుచు
ట్టమ్ములు సత్వరమ్ముగఁ గడంగి యనేకులు వీరయోధు లు
గ్రమ్ముగ వీఁకఁ దేరులు పొగడ్తకు నెక్కఁగ దీప్త మైనకో
పమ్మున నేచి పాండవులపై నడరం గని పేరెలుంగునన్. 293

వ. అన్నరనాథుండు. 294

తే. మీర లేర్పడ పఱచి మించి చనంగ
వలదు నా మ్రోల బలుపారి నిలువుఁ డనియె
వారు నిలువక పాండవబలము చేవ
దఱుగఁ జొచ్చి యుధిష్ఠిరుఁ దాఁకి రధిప. 295

వ. ఇట్లు చలంబున నవ్విభుం దలపడి వివిధాస్త్రంబుల నొప్పించినఁ గవ్వడి యును వడముడియుఁ గవలును ద్రౌపదికొడుకు లేవురును గోవిందు తమ్ముండును ధృష్టద్యుమ్నుండును శిఖండియును జండరయంబున నుద్దండచతురంగసమేతులై యా రథికులఁ బొదువుటయును వారు వీరోద్రేకంబున సైన్యసాగరంబున నున్మదమకర ప్రకరంబుల విధంబున విహరించి రట్లు పాండవసేనాసంక్షోభ సంపాదులగు నాజోదులయాటో పంబు విలోకించి గాంధారపతి గాంధారేయు నాలోకించి. 296

తే. మద్రవిభువారినమ్మెయిమార్తురాఁగి
కొనఁగ మనకు నుపేక్షింపఁజనునె యనుడు
నతఁడు నామాట వినక వారరిగి రేమి
సేయువారము చెప్పుమౌచిత్య మనియె. 297

వ. అని నన్ను నాపరివారంబును రక్షింపను దగ వెఱింగింపను నర్హుండ
వీవకావె యనుమాట లాడిన నతండు ప్రీతుండై బలపరిపాలనంబును
గర్జంబు సెప్పుటయును దనపనిగా మనంబునం బూని యవి దోఁచు
నట్టియుచితవచనంబుల నవ్వసుమతీపతికిఁ బ్రియం బాపాదించి 298

చ. వినుము నరేంద్ర సైనికులు విక్రమలీల నరాతిసేన సొ
చ్చినఁ బతి గావ కున్న సుపక్షీప్పుడు మెత్తురె యన్నఁ గాతుఁ గా
కని బహుతూర్యనాదములు నార్పులునుం జెలఁగంగఁ ద్రోచి య
జ్జనపతి వీఁకమై నడరె సైన్యయుతంబుగ సత్వరంబుగన్. 299

క. అంత ధనంజయకిమ్మీ
రాంతకముఖయోధవరమహాస్త్రప్రకరం
బంతకుకడ కనిచెఁ బరి
శ్రాంతం బగు మద్రనాథురథికచయంబున్. 300

వ. ఇవ్విధంబున. 301

మ. అరులం గీటడఁగించి పాండుసుతుసైన్యం బుబ్బి పైఁ గ్రమ్మినం
గురుభూనాయకుసేన నొచ్చి కలయం గూలెన్ ధరన్ గుంపులై
తిరుగం బాఱఁగఁ జొచ్చె విచ్చె మరలన్ దిగ్భ్రాంతి వాటిల్ల స
త్వరతన్ నల్లడఁ బాఱె నవ్విభుఁడు గర్వం బేది వెల్వెల్లఁగన్. 302

క. మనవారి కపుడు భీష్ముని
చనుటయుఁ గోదండగురునిసమయుటయును గ
ర్ణునిపొలియుటయును గ్రొత్తై
మనమున వెనుఁబాటు గదిరె మనుజాధీశా. 303

వ. అప్పు డద్దిక్కు జనంబులు. 304

చ ధరణికి నింక నాయకుఁడు ధర్మతనూజుఁడు నేఁ డవశ్యముం
గురుపతి గూలు నెవ్వగలకుం గుదు రయ్యెడు నాంబికేయుఁ డు
ద్ధురులగు పాండునందనుల దుర్దమఖంగి యెఱింగి ధర్మత
త్పరులకు గెల్పు ప్రాఁతె హరిభక్తులఁ బొందవె భూరిసంపదల్. 305

వ. అని రట్టియెడ నీకొడుకు నిజసారథిం జూచి మనబలం బాహవంబున కోహటించి పాఱెడు నిత్తఱి నేను బరవసంబు సేసినఁ గాని నిలువ దవ్విధంబునకు రథం బనువై యుండఁజేసి చేరఁ దెమ్మనిన వాఁ డట్ల చేయ నతం డేనుంగు డిగ్గి రథం బెక్కి యెక్కుడుమగఁటిమిం బొంగునంగంబులతో సైనికుల కడ్డంబు సని యెలుంగెత్తి. 306

ఉ. ఎక్కడఁ బోవ వచ్చు గిరు లేనియఁ గాననభూము లైనఁ దో
నెక్కియుఁ జొచ్చియుం బగతు రేడ్తెఱఁ గిట్టి చలంబునం దలల్
ద్రొక్కక తక్కరట్లయిన దుర్గతి వాటిలుఁ బోక నిల్చి పే
రుక్కునఁ బోరినన్ సుగతి యొండెను సంపద యొండెఁ జొప్పడన్. 307

వ. అట్లుంగాక. 308

క. పాండవబలం మల్పంబై
యుండం గృష్ణుఁడు ధనంజయుండును డప్పిం
బెండువడఁగఁ గని మనకును
గం డడఁగఁగ నేల గెలుపు గైకొన వచ్చున్. 309

వ. అని పలికి కరతలంబెత్త నిలు నిలుమని నబ్బలం బతనినగ్గించుచు మరలె నమ్మేటిమగండు ముంగలి యయి నిలిచి పొంగారం గవియుకౌంతేయ సేనాసముద్రంబునకుఁ జెలియలికట్ట యయ్యె నయ్యవసరంబునందు మునుకొని వడిం దఱుముపడముడిం బొదివి మనపవాతిప్రకరంబు దర్పంబున నార్పులు బొబ్బలుం జెలంగ బహువిధశస్త్రాస్త్రంబులు వరఁ గించినం బెరిఁగినమదాతి రేకంబున గదాదండంబు ధరియించి ఘోరాకారుం డగుచుఁ దేరు డిగ్గి పేరడవిఁ గూల్చు పెనుగాలికై వడి నతం డేకవింశతి సహస్రసంఖ్యసుభటుల నేలపాలు సేసె నప్పుడు. 310

క. కరిహయరథబృందం బు
ద్ధురత నడరెఁ బాండునృపసుతులమూఁకలపై

నరుఁ డబ్బలంబునకు ని
ష్ఠురగాండివముక్తశరపటుత్వము సూపెన్. 311

క. నకులసహదేవులును సా
త్యకియును రభసమున వాలురమ్ములు నిగుడన్
శకునిపయిఁ గవిసి రతఁడును
బ్రకటస్ఫురణఁ దనం దిరంబై పోరెన్ 312

చ. సమదగజాధిరూఢుఁ డయి సాల్వుఁడు పాండవసేనఁ జొచ్చి ఘో
టములఁ గలంచుచున్ రజఘటల్ విరియించుచుఁ గాల్బలంబుఁ జి
త్రముగ వధించుచున్ రథకదంబములన్ సమయించుచున్ మహో
గ్రముగఁ జరించుచెస్ఫురణఁ గన్గాని కోపసముద్భటాకృతిన్. 313

*ధృష్టద్యుమ్నసాత్యకులచేత సాల్వుఁ డేనుంగుతోడఁ జీనుంగై పడుట*

వ. ధృష్టద్యుమ్నుం డెదుర్కొనినఁ ద్రొక్కించువాఁడై యవ్వీరుండు వారణ
పతిఁ గొల్పిన నతండు. 314

మ. పటునారాచచయంబు కుంభయుగళీభాగంబునన్ బెట్టు రా
టుటయుం గ్రొవ్వఱి పాఱె నగ్గజము సాటోపంబుగాఁ గ్రమ్మఱిం
చుటకున్ సాల్వుని మెచ్చెఁ గన్గొనుజనస్తోమంబు కోపోద్గమో
ద్భటవేగంబున వచ్చి పట్టె నది యాపాంచాలుతే రుగ్ర మై. 315

క. ఆతఁడు గద చేతం గొని
భీతి గదురుమనముతోడఁ బృథ్వికి దాఁటెన్
సూతాశ్వసమేతంబుగ
నాతే రయ్యేనుఁ గెత్తె నాకసమునకున్. 316

ఆ. ఎత్తి త్రిప్పి యాడి యిలతోడ వ్రేసి పా
దములఁ జదుపఁ జూచి దారుణాస్త్ర
తతులు నిగుడఁ బవనతనయశిఖండిసా
త్యకులు సాల్వుఁ దాఁకి రతిరయమున. 317

క. ఆతఁ డందఱ బాణంబులు
వితథంబులు సేసి యస్త్రవిద్యావారీ

ఱత చూపె నవ్విధం బ
ద్భుతము నినిచె గగనచరతతులచిత్తములన్. 318

వ. అప్పుడు. 319

తే అజ్జపాటించి మదివెఱ యుజ్జగించి
రయము మెఱయ నప్పాంచాలరాజసుతుఁడు
గదిసి యెగసి కుంభస్థలి గదఁ బగుల్పఁ
గొండ గూలినట్లుక్కరి గూలె నధిప. 320

క. ఆలోనన శినివరుఁడు వి
శాలాస్యప్రదరనిహతి సాల్వునిశిర మా
భీలముగఁ ద్రుంప నాతఁడు
గూలిన మనమూఁక విచ్చెఁ గురుపతినిధీ. 321

ఉ. వాలి యెలుంగు చూపి కృతవర్ముఁడు సైన్యము నిల్వరించి యు
న్మీలితవిక్రముండగుడు మేమెఱు నాతనిఁ దాఁకె నస్త్రవి
ద్యాలసితుండు సాత్యకి యదగ్రత వారలు పోర వారిదో
ర్లీలలు చూచి రోటువడి రెండుబలంబుల యోధవీరులున్. 322

వ. ఇట్లు పెనంగి చుండి. 323

క. కృతవర్మ నొంచె నెనిమిది
శితశరముల శినివరుండు చెచెపరుచాపం
బతఁడు దునిమె బలువిలుగొని
యతనిహయంబులను సూతు నాతఁడు గూల్చెన్. 324

మ విరథుండై యఖిరామహంముున నవ్వీరుండు శైనేయు వై
చె రయంబార నశంపు భల్లమునఁ ద్రుంచెం బెక్కుతుండంబు లై
తొరుఁగం జూచి విషాదియై నిజరథస్థ్యు జేసి తద్బాణగో
చరతాదుర్దశ కాన్పఁథోద్యముఁ గృపాచార్యుండు దప్పించినన్. 325

క. మనసేన విఱిగె నృప నీ
తనయుం డొక్కరుఁ డుదగ్రతరముగఁ గుంతీ
తనయుల నద్దెసఁ గని యో
ధనికాయముఁ బొదివె బాణధారలఁ జెలువన్. 326

మ. పతి యిమ్మై సముదీర్ణ విక్రమకళాపారీణుఁ డై విద్విష
చ్చతురంగంబులయందు నొక్కటియు విస్ఫారోల్లసన్మార్గణా
హతికిం దప్పక యుండునట్లుగ సమగ్రాశ్చర్యసంపాదకో
ద్ధతబాహావిభవంబు సూపె సురబృందస్తోత్రపాత్రోద్ధతిన్. 327

వ. అప్పుడు రెండువీళ్ల నతనిపాటి మేటిమగలు లేరనుబుద్ధి నాకుం బొడమెఁ బదంపడి పాండవులును జేయఁగలవారలును నవ్వీరుం బొదివిన నతం డందఱ కన్నిరూపులై ధర్మసుతుని శతశరంబులను భీమసేను డెబ్బది సాయకంబులను సహదేవుని నైదింటను నకులు నఱువదినాల్గింటను ధృష్టద్యుమ్నుని సప్తమార్గణంబులను ద్రౌపదేయుల నైదైదుతూపులను సాత్యకి మూఁడు కాండంబుల నొప్పించి సహదేవు ధనువు దునిమిన నక్కుమారుండు వేఱొక్కవిలు గొని చలంబున నక్కురువిభుం గదిసినఁ దక్కటిరథికులుం గూడికొని యొక్కొక్కరుండు పెక్కమ్ములు పైఁ గురియఁ గేలిచందంబున వాని నన్నింటి వారించుచుఁ దత్తనువుల శోణితంబు పూరించుచు నాజెట్టిజోదు బెట్టిదుండై పెనంగ మన యోధులుం బురికొని యద్దొరల మార్కొనిరి మనసైన్యంబు దైన్యంబు విడిచి మరలి వారిబలంబులఁ దలపడియె నట్టియెడ. 328

క. ఘనుఁడు గురుతనయుఁడు ను
ద్దామ భుజావీర్యశౌర్యధైర్యములు జన
స్తోమము లగ్గింపఁగ సం
గ్రామ మొనర్చిరి నితాంతగాఢస్ఫూర్తిన్. 329

చ. పరుషపరాక్రమస్ఫురణఁ బంచపసుప్రసినాజులం జతు
శ్శరహతిఁ గూల్చె సౌబలుఁడు సత్వరుఁ డై సహదేవుఁ డమ్మహీ
శ్వరుఁ దనతేరిమీఁద నిడి సంగరమధ్యము వాపె నాతఁ డొం
డరదముమీఁదికిం జని రయంబున నయ్యరిఁ దాఁకె నుద్ధతిన్ 330

క. శరములఁ బొదివిన నాతఁడు
దిర మై యేయంగ రణము దివిజగరుడఖే
చరసిద్ధప్రకరాద్భుత
కరప్రకారమున నొప్పెఁ గౌరవనాథా. 331

సీ. శకునినందనుఁడును నకులుండు నొండొరులకుఁ జంకబాహుబలంబుఁజూపి
రతులశౌర్యమున సాత్యకికృతవర్ములు పోరిరి విలు ద్రుంచి కౌరవేంద్రుఁ
డేసె ధృష్టద్యుమ్ను నేచి యొండొకవింట నతనినాతఁడునొంప నక్షజంపుఁ
గయ్య మయ్యెరువుర కయ్యె ద్రౌపదిపుత్త్రు లేవురు పతిఁ గిట్టియింద్రియములు

తే. బాలిశునిఁ జిక్కువఱచినపగిదిఁ దలరఁ
జేయ నతఁ డీడఁబోవక సాయకములు
పెక్కు రయమున నిగిడించి యక్కుమార
వితతిఁగలఁపఁ దత్సంగర మతిశయిల్లె. 332

వ. మఱియు ననేకు లనేకులం బొదివి పోరాడ నంతకంతకుఁ బేర్చినయగ్గలిక
మొగ్గరంబులు రెండును గలయం బెరసినం దేర్చిన పెంధూళి భానుబింబంబు
గప్పి యప్పుడు దొరుఁగునరతురంగమాతంగరుధిరధారల నడంగిన
నధికంబైన సంగరంబునకుం గడంగిన కౌంతేయుల యురవడికి నోహ
టించి మన మోహరంబు దొరలు మరలిన మరలనీక నీకొడుకు పురి
కొలుపుకొని తఱిమినం గనలి ధర్మసుతుండు. 333

తే. మూఁడునారాచములఁ గృపు వాఁడి చెఱచి
వాలి కృతవర్మహయముల నాలుగింటఁ
గూల్పఁ దనతేరపై నిడి గురుసుతుండు
దొలఁగఁ గొంపోయె నవ్వీరధుని నృపాల. 334

చ. కురుపతి చూచి చిత్తమునఁ గోపము పెంపెసలార నేడునూ
ఱురదము లాజినిం బొదువునట్లుగఁ బంచిన నొక్క పెట్ట బం
ధురతరవారివాహములు తోయజబాంధవుఁ గప్పుచాడ్పు దోఁ
ప రయముమైఁ గడంగి యవి పైకొని యవ్విభుతోఁ బెనంగఁగన్. 335

క. కనుఁగొని శిఖండిముఖయో
ధనికాయం బతని యారథప్రకరంబున్
సునిశితశరప్రకరములఁ
దునుమాడెన్ రౌద్రరసము దొలకాడంగన్. 336

వ. ఆసమయంబున మనదెస నుల్కాపాతశర్కరావర్షాదులగు నుత్పాతంబులు
గలిగె వానికి శంకింపక శకుని గడంగి యోధవరులతో మీరు కోల్తల

